# ఫారెక్స్®
# మొట్టమొదటి ఎంపిక!

## ఎందుకంటే క్రొత్త మెరుగుపర్చబడిన ఫారెక్స్® మొదట మొదట ఘన ఆహారాలకు మారే పాపాయికి సహాయకరంగా అత్యావశ్యక పదార్థాల సమ్మేళనం.

**ప్రొటీన్లు మరియు క్రొవ్వు పదార్థాల సరియైన కలయిక.**
ఫారెక్స్. పాపాయి బలంగా మరియు ఆరోగ్యవంతంగా పెరిగేలా తోడ్పడటానికై ప్రొటీన్లతో సమృద్ధమైనది. పాపాయి యొక్క సున్నిత జీర్ణశక్తికి అనువుగా సరియైన పాళ్లలో క్రొవ్వు పదార్థంతో ప్రత్యేకంగా రూపొందించబడినది.

**పాపాయి రక్తాన్ని ఆరోగ్యవంతంగా వుంచడానికి తగినంత ఐరన్.**
నాల్గవ నెలప్పటికి పాపాయి యొక్క ఐరన్ నిల్వ తరిగిపోతుంది. పా●ాయి రక్తాన్ని ఆరోగ్యవంతంగా వుంచి రోగాలను ఎదుర్కొడానికి సహాయకరంగా తగినంత ఐరన్ కల్గినది ఫారెక్స్.

**కాల్షియం-ఫాస్ఫరస్‌ల ఆదర్శవంతమైన నిష్పత్తి.**
దినమూ, పాపాయి పళ్లు, ఎముకలు బలంగా మరియు ఆరోగ్యవంతంగా ా తోడ్పడటానికి, ప్రత్యేకంగా రూపొందించబడిన ఫారెక్స్‌లో కాల్షియం, ఐ ఆదర్శవంతమైన 2:1 నిష్పత్తిలో కలవు.

ాపాయికి పెట్టే ప్రతి చెంచాడు పోషణ తత్వ-యుక్త ఫారెక్స్ ం. కలపడానికి మరింత సులభం.




పాలు చేర్చే అవసరం లేదు.
కేవలం నీటిలో
కలిపి పట్టండి.

ఫారెక్స్®

CLARION/B/GX/13/244 TEL

# ఉత్తరాలు

## సీరియల్స్

ఈ వారం 'సుధ' ముఖచిత్రం, చూడ ముచ్చటగా, ఆకర్షణీయంగా వుంది. సీరియల్స్ జీవితం చేజారిందా, కాల్‌గర్ల్, సర్పయాగం, బలికోరిన ప్రేమ ఒక దానికి ఒకటి రేస్ గుర్రాల్లా పోటీ పడుతు పరుగెడుతున్నాయి.

కిర్తి కిష్టయ్య, లక్ష్మిదేవిపల్లి

★ ★ ★

ఆంధ్ర సచిత్రవారపత్రికలో సీరియల్స్ బాగా ఆకట్టుకుంటున్నాయి. 'సర్పయాగం' లో యానాదుల ఆచారాలు, పద్ధతులు, అలవాట్లు చాలా విపులంగా తెలియచేస్తున్నందుకు సంతోషంగా ఉంది. "జీవితం చేజారిందా?", "బలికోరిన ప్రేమ" నా మనస్సును కదిలించాయి.

కె. నాగరాజకుమారి, రామసముద్రం

## న్యూఢిల్లీ లేఖ

"మార్పు సహజం" వ్యాసంలో శ్రీ జయదుబాషి "ఆధునికీకరణ వలన కలిగే ప్రయోజనాలు అనుభవించాలంటే ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాలు అవసరమే" అని పేర్కొనటం ప్రశంసనీయంగా ఉంది. కాని అదే వ్యాసంలో ఒక పార్టీని పొగడుతూ, మిగతా పార్టీలను దూషించారు. అది విజ్ఞత అనిపించుకోనదు.

హైదరాబాద్ నోట్‌బుక్‌లో శ్రీలక్ష్మిరంజనం గారిపై వ్యాసం చాల బాగుంది. వారి మృతి దేశానికి తీరని లోటు.

ఆర్. వి. రాఘవరావు, ఒంగోలు

★ ★ ★

'సుధ' ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో జయదుబాషి గారి "న్యూఢిల్లీ లేఖ" (మార్పు సహజం) చాలా బాగుంది. మతపరమయిన పార్టీలు వాటి గుణగణాలు చక్కగా వివరించారు.

సింగం దత్తాత్రేయమూర్తి, ఒంగోలు

★ ★ ★

13–19' జూన్ పత్రికలో భా. జ. పా. గురించిన అద్భుత వాస్తవాలు అందించారు, దుబాషిగారు. హిందువులంతా ఒక జాతిగా ఎందుకుండగూడదన్న వారి ఆవేదనను ప్రతి హిందువూ న్యాయ బద్ధంగా ఆలోచించాల్సిందే. భా. జ. పా. ని యూరప్ లోని క్రైస్తవ పార్టీలతో పోల్చిన తీరు బాగుంది, కాని భారతదేశంలో భిన్న మతాలకు చెందిన ప్రజలు అధిక శాతంలో (యూరప్‌తో పోల్చితే) ఉండడం వలన మాత్రమే భా. జ. పా. ని మతతత్వ పార్టీగా ఉదహరిస్తున్నారన్నది జగమెరిగిన సత్యం.

హిందూ తత్వం విశ్వవ్యాప్తమైనదే కావచ్చుగాని, మన సంస్కృతిని మెచ్చినంతగా సంప్రదాయాలను మెచ్చలేము. ఎందుకంటే, మన మూఢ సంప్రదాయాలెన్నింటినో భూస్థాపితం చేస్తేనే గాని ముఖ్యంగా నేటి స్త్రీ స్వతంత్ర జీవనం గడించ లేక పోతుంది, ఈనాటికి కూడా.

–సిద్దినేని వెంకటేశ్వరరావు, సంగంజాగర్లమూడి □




ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

18-24 జూలై 1986
శ్రీ అక్షయ నామ సం. ఆషాఢ శు. ద్వాదశి
సంపుటము 78 : సంచిక 45

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6నెలల చందా | రు. 71.50 |
| పోస్టులో 12నెలల చందా | రు. 143.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
హిందీ నటి బబిత
(ఫోటో : పి. రవిచందర్)

### కథలు :-



### సీరియల్ నవలలు:-



### వ్యాసాలు, శీర్షికలు :

# విచ్ఛిన్నకరశక్తులకి తోడ్పడుతున్న భాషాసమస్య

బెల్గాం చక్కని పట్టణాలలో ఒకటి. అక్కడ చిన్న చిన్న ఫించనుదారులు నివసిస్తూ ఉంటారు. వాళ్ళు ఆ చుట్టుపక్కల ప్రాంతాల నించే కాకుండా ఎంతో దూరంగా ఉన్న గోవా, నాగపూర్‌ల వంటి చోట్ల నుంచి కూడా వచ్చి అక్కడ స్థిరపడుతూ ఉంటారు. అటువంటి ఊళ్ళో భాషకి సంబంధించిన సమస్యపై అల్లర్లు చెలరేగుతాయని ఎవరూ ఊహించలేరు. బెల్గాంలో మరాఠీ మాట్లాడేవాళ్ళు ఎక్కువగా ఉన్నా అది రెండు భాషలు మాట్లాడే ప్రాంతమనే చెప్పాలి. అక్కడ మాట్లాడే మరాఠీ భాష పూనేలో ఉన్నట్లు ఉండకపోవచ్చు. కానీ మరాఠీ దిన, వార, పక్ష, మాసపత్రికలు అధిక సంఖ్యలోనే అక్కడ అమ్ముడవుతాయి. తార్కికంగా చూస్తే అది మహారాష్ట్రకి చెందాల్సి ఉంటుంది. అయితే తర్కం అనేది రాజకీయ వాదులకి ఎక్కడా, ఎప్పుడూ అంత ముఖ్యమైన విషయంకాదు - ప్రధానంగా భారతదేశంలో. ఈ అసమానతని తొలగించాలని ఎవరో అనటం. దానికి బదులుగా అవతలి




వైపువారిలో ఎవరో ఒకరు గట్టిగా ఉపన్యాసాలు ఇవ్వటం, లేదా కన్నడ భాషని విధిగా ఉంచాలని అర్థంలేని న్యాయాలని వల్లించటంతో అగ్నిలో ఆజ్యం పోసినట్లు అవుతుంది.

నేనొకసారి రైలులో ఫ్రాంక్‌ఫర్ట్ నుంచి బాన్ వెళుతున్నాను. దానిని ఎయిర్‌పోర్ట్ ఎక్స్‌ప్రెస్ అంటారు. అది సూపర్ ఫాస్ట్ రైలు. మనమొక విందు భోజనం ముగించే సమయంలో అది తన గమ్యస్థానం చేరుతుంది. అంత వేగంగా ప్రయాణించే రైలు అది. ఆ రైలులో నాతోపాటు అమెరికన్ పర్యాటకుడు ఒకతను ప్రయాణం చేస్తున్నాడు. భారతీయులందరిలాగే నేను కూడా అతనిని 'అమెరికా సంయుక్త రాష్ట్రాలలో మీరు ఏ ప్రాంతానికి చెందినవార'ని అడిగాను. అతను చిరునవ్వు నవ్వి 'అది చెప్పటం కష్టం' అన్నాడు. ఇంకా ఇలా అన్నాడు: తాను బఫెలో అనే చోట పుట్టాననీ, విద్యార్థి దశ అంతా దాదాపు కాలిఫోర్నియాలో గడిచిందనీ, అక్కడే డిగ్రీ తీసుకున్నానని అన్నాడు. ఉద్యోగం కోసం న్యూయార్క్ వెళ్ళాడట. అతను ప్రస్తుతం అట్లాంటాలో కోకోకోలాలో పనిచేస్తున్నట్లు చెప్తూ శాన్‌ఫ్రాన్సిస్కోలో తనకి ఇల్లు ఉందనీ, కానీ తిరిగి న్యూయార్క్ వెళ్ళిపోదామనుకుంటున్నానని అన్నాడు. నేను అమెరికా అంతటికీ చెందుతానని అన్నాడతను. అందులో తాను ఏ ఒక్క ప్రాంతానికో, లేదా రాష్ట్రానికో చెందిన వాడిని కాదన్న భావం కనిపించింది.

భారతదేశంలో కూడా అటు వంటి వ్యక్తులు లేదా కుటుంబాలు మనకి ఎక్కువ సంఖ్యలోనే కనిపిస్తాయి. ఆ సంఖ్య మరింతగా పెరుగుతూ ఉన్నది. ప్రజలు వలసపోతూ ఉండటం, పారిశ్రామికాభివృద్ధి కారణంగా అలా జరుగుతున్నది. పరిణామక్రమంలో భాగంగా సాధారణంగా అది జరుగుతూ ఉంటుంది. ఢిల్లీలో ఉన్న కొన్ని సంపన్నుల కాలనీలని,వాస్తవంగా అవి అంత సంపన్నులైన వారివి కావు. చూస్తే వివిధ రాష్ట్రాలకి చెందిన అన్ని రకాలైన పేర్లూ కనిపిస్తాయి. వాళ్ళందరూ ఉద్యోగం కోసమో, మరో దానికోసమో వచ్చి ఢిల్లీని తమ స్థిరనివాసంగా చేసుకున్నటువంటివారే. మీరెవరని వాళ్ళని అడిగితే మదరాసువాళ్ళమనో, బొంబాయి వాళ్ళమనో అంటారు. చివరికి బెల్గాం నించి వచ్చామని కూడా చెబుతారు. వాళ్ళంతా తమ ప్రాంతానికి, లేదా రాష్ట్రాలకి వెళ్ళి కొన్ని సంవత్సరాలు గడిచిపోయి ఉండవచ్చు. ఇక ముందు కూడా వారికి అక్కడికి వెళ్ళే అవసరం లేకపోవచ్చు. నిత్య వ్యవహారంతో వారిని ఢిల్లీ వారు గానే పరిగణించటం జరుగుతుంది.

బొంబాయిలో, మిగతా నగరాలలో కూడా కొన్ని తరాలుగా అక్కడే ఉంటున్న కుటుంబాల వారికి కొందరికి స్థానిక భాష మాట్లాడటం తెలియదు. జె.

ఆర్. డి. టాటా తమని తాము ఎలా చెప్పుకుంటారో నాకు తెలియదు కానీ ఆయనని మహారాష్ట్రుడని అన్నవారు నాకింతవరకూ కనిపించలేదు. ఆయన కుటుంబం బొంబాయిలో ఒక శతాబ్దంగా ఉంటున్నది. టాటాలు లేని బొంబాయా? అందువల్ల జె. ఆర్. డి. టాటా మరాఠీ కాకపోయినా మహారాష్ట్రుడే. అలాగే బిర్లాలు కలకత్తాకి చెందినవారు. అక్కడ వారికి నివాసాలు ఉన్నప్పటికీ వాళ్ళు బెంగాలీలు కారు. రాజ్‌కపూర్ సంగతి ఏమిటి? ఆయన మహారాష్ట్రుడా లేక పఠానా? ధీరూభాయ్ అంబానీ విషయం ఏమిటి? ఆయన మహారాష్ట్రలో ఉంటున్న గుజరాతీనా లేక గుజరాత్ నుంచి వచ్చిన మహారాష్ట్రుడా?

నా ఉద్దేశ్యంలో కార్వార్ లాగే బెల్గాంకూడా మహారాష్ట్రకి చెందాలి. ఎందుకంటే బెల్గాంలో మరాఠీ మాట్లాడే వారి సంఖ్య ఎక్కువ కాబట్టి. ఏదో కారణంగా రేపు మరాఠీ మాట్లాడే వారి సంఖ్య తగ్గవచ్చు.
అప్పుడు ఏమవుతుంది? ఇక మీదట బొంబాయి మరాఠీ మాట్లాడే నగరంగా ఉండదని జనాభాలో అధిక సంఖ్యాకులని బట్టి చూస్తే పరిస్థితి అలా ఉన్నదని విన్నాను. అందుచేత అది మహారాష్ట్రకి చెందనిది అవుతుందా?

నా ఫ్రాంక్‌ఫర్ట్ మిత్రుడు తాను న్యూయార్క్‌కి, కాలిఫోర్నియాకి చెందిన వాడినని అన్నాడు. అలాంటప్పుడు జె. ఆర్. డి. వంటి వ్యక్తి తాను మహారాష్ట్రుడిననీ, గుజరాతీని అని ఎందుకు చెప్పకూడదో నాకు అర్థంకాదు. ఎందుకంటే టాటాలు గుజరాత్‌లోని ఒక చిన్న ఊరైన నవ్‌సారి నించి వచ్చినవారే. బీహార్‌లో వారి అతి పెద్ద సంస్థ టాటా స్టీల్ ఉంది. జె. ఆర్. డి. అక్కడే ఎక్కువ కాలం గడుపుతూ ఉండి ఉండాలి. అందువల్ల టాటాలు బీహారీలని కూడా చెప్ప వచ్చు. జె. ఆర్. డి. ఫ్రాన్స్‌లో పుట్టారు కాబట్టి ఆయన ఫ్రెంచ్ వాడు కూడా. ఆయన గుజరాతీ కంటే ముందుగా ఫ్రెంచి భాషే నేర్చుకున్నారు. మరి బిర్లాల మాటేమిటి? వారికి ప్రతిచోటా నివాసాలు ఉన్నాయి. ఢిల్లీ, బొంబాయి, జైపూర్, కలకత్తాలలో. వాళ్ళంతా పిలానీకి చెందినవాళ్ళు కాబట్టి అక్కడా వారికి ఇళ్ళు ఉన్నాయి. వాళ్ళ కంపెనీలు రిజిస్టరు చెయ్యబడిన ప్రతి చోటా వారు పన్నులు కడుతున్నారు. అవి దాదాపు దేశం అంతటా ఉన్నాయి. విదేశాలలో కూడా వారి సంస్థలు పన్నులు కడుతూ ఉండి ఉండవచ్చు.

జనం ఎక్కువగా ఒక చోటి నించి ఇంకొక చోటికి తిరగని కాలంలో, లేదా అలా తిరిగినా మరల తమ స్వస్థలానికి చేరుకున్నప్పుడు భాష అనేది భారతీయుడికి ఒక ప్రధానమైన విషయంగా ఉండేది. కానీ జనం ఒక చోటి నుంచి మరో చోటికి విస్తృతంగా ప్రయాణం చేస్తున్న, వలస పోతున్న ఈ రోజులలో అది అలా ఉండటానికి అవకాశంలేదు. అమెరికా సంయుక్త రాష్ట్రాల వంటి దేశాలలో పరిస్థితి వేరు. అక్కడ ఉన్న వివిధ జాతుల వారికి వారి వారి భాషలు వేరుగా ఉన్నప్పటికీ దేశం అంతటా ఒకే భాష మాట్లాడుతారు. భాషాపరమైన భావాలకి దెబ్బ తగలకుండా ఒక అమెరికన్ టెక్సాన్‌గా, న్యూయార్క్‌కి చెందిన వాడిగా కూడా ఉండవచ్చు. బీహార్‌లో టాటాలు దాదాపు శతాబ్దంలో మూడు వంతుల కాలానికి పైగా నివసిస్తున్నప్పటికీ వారు ఇంకా విదేశీయులుగానే పరిగణింపబడుతున్నారు. అంతే కాకుండా ఆ రాష్ట్రానికి వారు జగన్నాధ్ మిశ్రాలూ, బిందేశ్వరి దూబేలూ కలిసి చేసిన సేవకన్నా ఎంతో ఎక్కువే చేసారు. గోవాలో మనకి ప్రతాప్‌సింగ్ రాణె వంటి వారు ఉన్నారు. ఆయన పూర్వీకులు ఆ రాష్ట్రానికి చెందినవారు కారు, బయటివారే. ఆ కారణంగానే కొంకణిని ఆ రాష్ట్రంలో అధికార భాషని చెయ్యటానికి ఆయన వ్యతిరేకిస్తున్నారు. అలాంటివారితో ఏం చెయ్యాలి?

అది కష్టంగా ఉండే ప్రశ్నే కానీ దానిని మనం నేడో రేపో ఎదుర్కోవాల్సి ఉంటుంది. ఎందుకంటే భాష అన్నది భారతీయులని సమైక్యపరచటం కాకుండా విడదీయటం మొదలు పెట్టింది. అది జరగ కూడనిది. బెల్గాంలో భాషాపరమైన అల్లర్లు చెలరేగితే అలాంటివి బొంబాయిలోనో, కలకత్తాలోనో లేదా జంషెడ్‌పూర్‌లోనో తలెత్తవచ్చు. ఇప్పటికే మన దేశంలో కావలసినన్ని విచ్ఛిన్నకర శక్తులు పనిచేస్తున్నాయి. వాటికి తోడుగా భాష కూడా హింసలో, విచ్ఛిత్తిలో తన వంతు పాత్ర నిర్వహిస్తున్నది. □

# విన్నారా!

అభిమానులందరికీ
ఆనందం కలిగించే
ఆంధ్రుల అభిమాన సంస్థ

**ఆంధ్రపత్రిక**

నుంచి అతి త్వరలో
వెలువడుతోంది!
ఆకర్షణీయమయిన
కొత్త సినిమా వారపత్రిక!!

సీరియల్

# కరిగిన శిల

రాపినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

ఆ రోజు ఆదివారం.

పనంతా అయ్యాక ఓ నవల తీసుకుని డాబామీది కెళ్ళింది సరయు. అప్రయత్నంగా ఆమె కళ్ళు "వంశధార" కేసి తిరిగాయి.

ఆ భవంతి ఎప్పటికన్నా సందడిగా వుంది. ఆవరణంతా స్తంభాలు పాతి పెద్ద పెద్ద పందిళ్ళు వేస్తున్నారు. పై అంతస్తు మొత్తం షామియానాలు వెలిశాయి. వీధి మొదట్నుంచి లైట్స్ అరేంజ్ చేస్తున్నారు.

ఆ ఆర్భాటం, హడావిడి చూస్తుంటే ఆ ఇంట్లో ఏదో శుభ కార్యం అత్యంత వైభవంగా జరగబోతోందని చెప్పకుండానే తెలిసిపోతుంది.

"శ్యామల పెళ్ళి కాబోలు! ఆ మధ్య కల్పన అంది శ్యామల ఓ డాక్టర్ని ప్రేమించి పెళ్ళి చేసుకోబోతోందని, అతగాడూ ఓ లక్షాధికారి ఏకైక పుత్రరత్నం అనీను!

నిజంగా లక్ష్మి లక్ష్మినే వరిస్తుంది" చిన్నగా నవ్వుకుంది సరయు.

మరికాస్సేపు ఆ వైభవాన్ని చూసి పుస్తకం తెరవకుండానే కిందికి దిగి వచ్చేసింది.

ఆ రాత్రంతా "వంశధార" దేదీప్యమానంగా వెలిగిపోయింది. సరయు నిద్ర లేచేసరికి అది మరింత ముస్తాబై కళ్యాణ వైభవాన్ని ఎలుగెత్తి చాటుతోంది.

చుట్టపక్కాలతోనూ, పోలీసు బలగంతోనూ, కళ్యాణమండపం కట్టేవారితోనూ "వంశధార" ఆవరణంతా కిటకిటలాడిపోతోంది.

"బహుశా ఈ రాత్రికే లగ్నం అయుంటుంది" అనుకుంది సరయు.

కూతురు భోజనం చేసి ఆఫీసు కెళ్ళగానే తనూ భోజనంచేసి ఇల్లు సర్దుకుని నడుంవాల్చింది శాంతమ్మ.

ఇప్పు డామె పెద్దగా పన్లు చెయ్యకపోయినా తరచు గుండె దడ, ఆయాసం వస్తున్నాయి.

సరయుకి పెళ్ళి చెయ్యాలనే ఆరాటం ఎక్కువయింది.

"తనుపోతే సరయు గతేవిటి?" అనుకుంటేనే ఆమె మనసు విలవిల్లాడిపోతోంది.

"డాక్టర్లు ఆలోచించద్దంటారు. కానీ ఎలా? తన జీవితమే ఓ ఆలోచనల పుట్ట. ఈ ఆలోచనల్లోనే ఏదో ఒకనాడు తన వూపిరి స్తంభించి పోతుంది. అది ఎప్పుడైనా జరగచ్చు! అందుకే సాధ్యమైనంత తొందరగా సరయుని ఓ అయ్య చేతుల్లో పెట్టాలి. తనకి అయినవాళ్ళు గానీ..... తన నాదుకునే వాళ్ళు గానీ ఎవరూ లేరు. నలుగురిలో తిరిగే ఎవరికాళ్ళో పట్టుకుని ఆ శుభ కార్యం కాస్తా జరిపించెయ్యాలి!" ఇలా ఆలోచిస్తూ నిద్రలోకి జారిపోయింది శాంతమ్మ.

మధ్యాహ్నం నాలుగవుతూండగా రమణ వచ్చి తాళాలు తీసుకున్నాడు. అతని క్కాస్త కాఫీ కలిపిచ్చి కుశల ప్రశ్నలు అడిగింది.

రమణ అద్దె డబ్బులు చేతిలో పెట్టాడు. అవి తీసుకుని,

"రమణా!" అంది మెల్లగా.

"ఏవిటండి?" వెళ్ళబోతున్నవాడల్లా ఆగి వెనక్కి తిరిగాడతను.

"ఓ క్షణం కూర్చుంటావా?" అభ్యర్థనగా అడిగింది శాంతమ్మ.

"ఏవిటండి! ఇల్లు కాళీ చెయ్యాలా?" కంగారుగా అన్నాడు రమణ.

"ఛ! ఛ! అదికాదు. నువ్వో సహాయం చెయ్యాలి!"

"నేనా?" ఆశ్చర్యంగా అన్నాడతను.

"అవును. నువ్వు పది మందిలో తిరుగుతూంటావుకదా....."

"చెప్పండి!" కూర్చుంటూ అన్నాడు రమణ.

"నీ ఎరికలో ఓ మంచి కుర్రాడుంటే చూద్దూ....." వేడికోలుగా అంది శాంతమ్మ.

"ఎవరికండి?" పరధ్యానంగా అన్నాడతను.

"మా సరూకే నాయనా! మనం మనం ఒకకులంవాళ్ళం. నీ ఎరికతో ఎవరైనా వుంటే కాస్త చూడు. కట్నకానుకలు అంతగా ఇచ్చుకోలేకపోయినా ఈ ఇల్లు అతగాడి పేరున పెట్టేసి, చేతనైనంతలో పెళ్ళిచేసి తేలిగ్గా వూపిరి తీసుకుంటాను. నా ఆరోగ్యం అంతంత మాత్రంగానే వుంది. నీ దయవల్ల ఆ శుభకార్యం కాస్తా అయిపోయిందా నేను హాయిగా కన్నుమూస్తాను." అంది.

"తప్పకుండా చూద్దావండీ! మా ఇళ్ళలోనే వుండచ్చు. మీరేం దిగులుపడకండి! అన్నీ సవ్యంగానే జరుగుతాయి." అంటూ ధైర్యం చెప్పాడు రమణ.

* * * *

ఆరోజు సూర్యోదయానికి ముందుగానే లేచి, తలంటుకుని కొత్త చీర కట్టుకుంది సరయు. దేవుడి ముందు నిల్చుని అంజలి ఘటించి, తరవాత తల్లి పాదాలకి నమస్కరించింది.

అరవిచ్చిన గులాబీలా వున్న కూతుర్ని అక్కున చేర్చుకుంది శాంతమ్మ.

ఆరోజు సరయు పుట్టిన రోజు.

"అమ్మా! మధ్యాన్నం శలవు పెట్టి వచ్చేస్తాను. వనజా వాళ్ళింటికెళ్ళి, దాన్ని

జరిగిన కథ -3: శాంతమ్మ ఏకైక కుమార్తె సరయు. తమ ఇంట్లో అద్దెకు ఉండే రమణ అంటే సరయుకి సదభిప్రాయం లేదు. ఎస్. పి. రామారావు ఏకైక కుమార్తె డాక్టరు శ్యామల. తను ప్రేమించిన డా. ప్రభాకర్‌తో ఆమె పెళ్ళి నిశ్చయమవుతుంది. సరయుకి కృష్ణయ్య అండ్ కంపెనీలో ఉద్యోగం వచ్చింది. తల్లికి గుండె ఎన్‌లార్జ్ అయిందని డాక్టర్ చెప్పగానే విని వణికిపోయింది సరయు. రమణ ఊరికి వెళుతున్నానని చెప్పి తాళాలు ఇచ్చి వెళతాడు.



కూడా తీసుకుని సినిమా కెళ్దాం" అంది సరయు.

"అలాగే!" అంది శాంతమ్మ నవ్వుతూ.

టైమవగానే భోజనం చేసి కొత్త చీర అంచుల్ని సరిచేసుకుంటూ, తల్లికి మరోసారి చెప్పి హడావిడిగా బైటికొచ్చింది సరయు.

బస్సు వెంటనే దొరకడంతో కాస్త ముందుగానే ఆఫీసుకి చేరుకుంది. మేనేజర్ గదిలో కొచ్చి-

"గుడ్‌మార్నింగ్ సర్!" అంది ముంగురులు సరిచేసుకుంటూ.

"వెరి గుడ్‌మార్నింగ్! ఏవిఁటమ్మా ఏవిఁటివాళ కాస్త ముందుగానే వచ్చినట్టున్నావ్!" అందరికన్నా అరగంట ముందు వచ్చే మేనేజర్ చిరునవ్వుతో అన్నాడు.

"అవున్సార్!.... ఇవాళ నా బర్త్ డే! పర్మిషన్ అడుగుదామని......" కాస్త సిగ్గుగా అంది సరయు.

"ఓ!..... మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ద డే!" అనేసి ప్యూన్‌చేత కాఫీ తెప్పించాడు మేనేజర్. కాఫీ తాగాక ఓ గంటుండి, ఇంపార్టెంట్ ఫైల్స్ ఏవైనా వుంటే చూసి వెళ్ళిపొమ్మన్నాడు.

ఆయనకి థాంక్స్ చెప్పి తన సీట్లో కెళ్ళి కూర్చుంది సరయు.

ఇవాళ ఆమెకేం పని చెయ్యాలనిపించలేదు. అలా అని వుత్సాహంగానూ లేదు. అదోలాంటి నిస్పృహ ఆవరించేసిందామెని. కారణం-

"ఈరోజు కొత్త చీర కట్టుకున్నావే?" అని గానీ, "అబ్బ! ఈ చీరలో ఎంత అందంగా వున్నావ్?" అని గానీ - ఒక్కరూ అన్లేదు. ఇదే కాలేజీలో అయితేనా..... ఆడపిల్లలంతా చుట్టూ చేరి తన అందాన్ని వర్ణించి, వర్ణించి అలిసిపోయేవారు. మొగ పిల్లలు ఆరాధనగా చూసేవారు! ప్చ్! ఆ రోజులే వేరు!" భారంగా నిట్టూర్చింది సరయు.

"ఈ రోజులు మరీ యాంత్రికంగా తయారయ్యాయి. పరుగులు! ఒకటే పరుగులు! మనిషిని మనిషి సరిగ్గా చూడ్డానిగ్గానీ, హాయిగా పలకరించుకోవడానిగ్గానీ టైము లేనట్టు.... యంత్రంలా మారిపోయారి జనం!" విసుగ్గాఅనుకుంది సరయు.

"ఎక్స్‌క్యూజ్‌మి...." చిన్నగా దగ్గాడో వ్యక్తి.

తృళ్ళిపడి చూసిన సరయు కళ్ళు క్షణం అతన్ని పరిశీలనగా చూశాయి.

"గుడ్‌మార్నింగ్ మేడమ్!" చనువుగా అన్నా డతను.

"ఇతను.... ఆ రోజు..... ఇంటర్వ్యూలో..... ఓహ్!" క్షణం మనసులోనె మననం చేసుకుని గభాల్న లేచి -

"మీరు......" అంది ఆశ్చర్యంగా.

"నేను..... నేనే!" నవ్వా డతను.

సరయు ఇంకా విస్మయంనించి తేరుకోకముందే-

"ముందు కూర్చోండి" అన్నా డతను.

"ఓ! సారి! ముందు మీరు కూర్చోండి!"

అతను కూర్చున్నాడు ఆమె కెదురుగా వున్న సీట్లో.

"వాట్ కెన్ఐడు సర్?" మెల్లగా అంది సరయు.

# కరిగిన శిల

"చెప్తాను. ముందు నన్ను నేను పరిచయం చేసుకోనీండి. నా పేరు మాధవ్. పూర్తి పేరు వేణుమాధవ్. కొందరు వేణు అనీ, కొందరు మాధవ్ అని పిలుస్తారు. మీ కెలా పిలవాలనిపిస్తే అలా పిలవండి" గలగలా మాట్లాడుతున్నాడతను.

"మీరు..... ఆ రోజు నన్ను ఇంటర్వ్యూ చేసిన వారిలో ఒకరు కదూ?" కుతూహలంగా అడిగింది.

"ఛ! ఛ! నేను ఇంటర్వ్యూ చెయ్యడ మేమిటి నా మొహం! అంకుల్ వాళ్ళు చేస్తుంటే నేను పక్కనున్నానంతే!" నవ్వేశాడతను.

"అంకులంటే....?"

"ఓ! మీకు తెలియదుకదూ? మీ బాస్ మా అంకుల్. ఇప్పుడు నే నొచ్చింది కూడా ఆయన కోసమే..ఆయ నిక్కడుంటారని కాదు..... ఆయన వూళ్ళో వున్నారా లేదా అని అడగడాని కొచ్చాను. వూళ్ళో లేరని మేనేజర్ చెప్పారు. ఎలాగో వచ్చాను కదా అని మిమ్మల్ని కూడా ఓసారి చూసిపోదామని ఇలా వచ్చాను. బై ది బై ఎలా వుంది మీ కిక్కడ?" చనువుగా అడిగాడు మాధవ్.

"బానే వుంది. నా కి వుద్యోగం ఇస్తారని మీకు ముందుగానే తెలుసా?"

"ఇంటర్వ్యూ కమిటీలో నేను లేకపోయినా ఆ సమయానికి నేను అక్కడే వున్నానుగా" మళ్ళీ నవ్వాడతను.

సరయు కూడా నవ్వింది. రెండు నిమిషాల తర్వాత—

"మిస్టర్ మాధవ్!" ఒక్క అనుమానం నన్ను చాలా రోజులుగా పట్టి పీడిస్తోంది...... మీ కభ్యంతరం లేకపోతే....."

"ఏమిటండి అది?"

"ఆ రోజు ఇంటర్వ్యూలో మీరు...... అడిగిన...."

"నేను కాదు. మా అంకుల్ వాళ్ళు!" సరిచేశాడు మాధవ్.

"మీరూ అడిగారుగా!"

"ఏమని?......"

"అదే. నేను నవ్వితే......"

"ఓ! అదా!..... మరి మీరు నవ్వారుగా!" అల్లరిగా అన్నాడతను.

"బావుంది...... ఆ నవ్వుకి కారణం కూడా చెప్పానుగా....." గంభీరంగా అంది సరయు.

"నిజమే. ప్రశ్న, జవాబు రెండూ అయిపోయాయి. మరి మీ అనుమానం ఏమిటి?"

"చెప్తాను..... అది సరే...... మీ అంకుల్ నాకు మళ్ళీ ఏనాడూ కనిపించలేదేం? ఇక్కడికి రారా?" కుతూహలంగా అడిగింది సరయు.

"వస్తారు! కానీ చాలా అరుదు!"

"అదేం?"




"వారికిలాంటివి చాలా ఆఫీసులున్నాయి. ఇవిగాక..... చాలా రకాల బిజినెస్‌లు కూడా వున్నాయి. వాటికోసం దేశమంతా తిరుగుతూంటారు. అవి మీకు చెప్పినా అర్థం కావులెండి!"

"ఓ. కే!..... మరో చిన్న అనుమానం!"

"అడగండి!"

"నేను ఇంటర్వ్యూలో ఏం చెప్పానని ఈ వుద్యోగం నా కిచ్చారో ఎంత ఆలోచించినా నాకు అర్థం కావడం లేదు."

"అయితే ఆలోచించకండి!" నవ్వాడతను.

"అదికాదండీ!.... ఆ రోజు నేను కాస్త దురుసుగా కూడా మాట్లాడాను. కానీ....."

"అబ్బ! ఇందులో అంత అర్థం కాని భేతాళ ప్రశ్న ఏం లేదండీ!"....

"కాదు మీరు చెప్పాలి!"

"అయితే వినండి!..... మీరు అంకుల్ ముందే....." అతని మాట పూర్తి కానే లేదు-

"సర్! మీకు ఫోన్...." అంటూ వచ్చాడు ప్యూన్.

"ఎక్కణ్ణుంచి?" నుదురు చిట్లించాడు మాధవ్.

"బొంబే నించి!"

"ఓ!...... అంకుల్ అయ్యుంటారు. వస్తాను! మళ్ళీ కలుద్దాం! బై!" అంటూ చిరునవ్వుతో వీడ్కోలు తీసుకుంటున్న మాధవ్‌ని అలా చూస్తూండి పోయింది సరయు.

* * * * * * *

సరయు ఇంటికి వచ్చేసరికి తల్లి రెడీగా వుంది. ఇద్దరూ కలిసి ఆటోలో వనజా వాళ్ళింటికి వెళ్ళారు. అయితే వనజ వూళ్ళో లేదు. ఉసూరుమంటూ తిరుగుమొహం పట్టి....... దోవలో గుళ్ళో కెళ్ళి ఇల్లు చేరుకున్నారు తల్లీ కూతుళ్ళిద్దరూ.

ఇంటికి రాగానే బట్టలు మార్చుకుని కాఫీ కలుపుకు తాగి, విరబూసిన జాజులన్నీ ఓపిగ్గా కోసి మాల కట్టుకుని తల్లో పెట్టుకుంది సరయు. శాంతమ్మ మాత్రం కాఫీ కాగానే గీత పట్టుక్కూర్చుంది.

ఆమెకి మనసు బావుండనప్పుడల్లా గీత చదువుకోవడం అలవాటు. ఏమిటో ఆ రోజు ఆమెకి ఒంట్లోనూ, మనసులోనూ కూడా బాగా లేదు. కూతురు బాధ పడుతుందని బయల్దేరిందే గానీ ఆమె కసలు బైటి కెళ్ళాలనే అనిపించలేదు.

సరయు అన్నం వండి..... తల్లిని పిల్చింది. ఆమె ఈమధ్య తల్లిని వంట జోలికే పోనివ్వడం లేదు. ఇద్దరూ భోజనాలు చేశారు.

"ఏమిటమ్మా నీరసంగా వున్నావ్?" అంది సరయు తల్లి చదివిన భగవద్గీత తీసి పైన పెడుతూ.

"ఏంలేదమ్మా! నిద్ర వస్తోంది!" అందంగా అబద్ధం చెప్పింది శాంతమ్మ.

నిజానికి ఆమెకి సన్నగా గుండెల్లో నెప్పి ప్రారంభ మయింది.

"అయితే పడుకో!.... నే నలా డాబా మీది కెళ్ళొస్తాను" అంది సరయు.

"సరే" అన్నట్టు తలూపిం దావిడ.

తరవాత డాబామీది కెళ్ళి "వంశధార" వైభవాన్ని చూస్తూ నిల్చుంది సరయు.

పెళ్ళి అయిపోయినా ఆ ఇంటి నుంచి వైవాహిక దీప్తి తొంగి చూస్తూనే వుంది.

ఎప్పటిలా ఆ వైభవాన్ని చూసి అచ్చెరువందడం లేదు సరయు.

ఆమె మనస్సంతా అమ్మ మీదుంది. ఆవిడ ఆరోగ్యం మీదుంది.

"పాపం! అమ్మ జీవితంలో ఎన్నో విధాల ఓడిపోయింది. అన్ని విధాలా అలిసి పోయింది..... కళ్ళల్లో ఒత్తులేసుకుని తనని పెంచింది. తన కోసం బతికింది. అలాంటి తల్లిని తనెలా కాపాడుకోగలదు?" అనుకుంది బాధగా. మనసు, తనువు కూడా బావుండనప్పుడు మాత్రమే గీత చదువుతుందని సరయుకి తెలుసు. అందుకే తల్లిని గురించి అంత కలత చెందిందా రోజు.

ఓ గంట తర్వాత కిందికొచ్చింది. అప్పటికే శాంతమ్మ హాయిగా నిద్రపోతోంది. తను కూడా పక్కమీద కొరిగి కళ్ళు మూసుకుంది నిద్రాదేవిని ఆహ్వానిస్తూ.

* * * * * *

# కరిగిన శిల

మంచి నిద్రలో వున్న సరయు తృళ్ళిపడి లేచింది. గదంతా చీకటిగా వుంది. బైట వర్షం పడుతున్నట్టు శబ్దం అవుతోంది.

దాహం అనిపించిం దామెకి. మెల్లగా లేచి లైట్ వెయ్యబోయింది. అయితే రెండు బలమైన చేతులు పట్టి ఆపేశాయి. కెవ్వున అరవబోయిన ఆమె నోటిని మూసేశాయి.

సరయు భయంతో ఒణికిపోయింది. ఉక్కు హస్తాల్లా వున్న ఆ చేతుల్లోంచి బైట పడాలని విశ్వ ప్రయత్నం చేసింది. కానీ ఆమెకి సాధ్యం కాలేదు.

హటాత్తుగా మెరుపు మెరిసింది. ఆ మెరుపు వెలుగులో తనకి సమీపంగా వున్న వ్యక్తిని గుర్తించిందామె.

అతను రమణ.

ఆకలిగొన్న పులిలా ఆమె నాక్రమించుకుంటున్నాడు.

తలుపులు వేసి వుండగా అతను లోపలి కెలా వచ్చాడో అర్థం కాలేదు సరయుకి. ఆమె గుండె వేగంగా కొట్టుకుంటోంది. జరగబోయేదేమిటో అర్థం అయిన ఆమెకి ఎక్కడ లేని బలం వచ్చింది. తన నోరు మూసిన చేతిని గట్టిగా కొరికి పిచ్చి బలంతో అతన్ని ఒక్క తోపు తోసింది.

ఎదురుచూడని ఈ సంఘటనకి బిత్తర పోయిన అతను విసురుగా వెళ్ళి గోడకి గుద్దుకున్నాడు. అదే సమయం అని స్టూల్‌మీదున్న కత్తి అందుకుంది సరయు.

క్షణం బెదిరాడతను.

"మర్యాదగా వెళ్ళిపో!" అంది సరయు.

అతను మాట్లాడలేదు.

"నీకే చెప్పేది..... వెళ్ళిపో!...... గెటవుట్! గెట్టవుటయ్‌సే!" గట్టిగా అరిచింది సరయు. అతను వంకరగా నవ్వాడు.

"వెళ్తావా వెళ్ళవా?"

"వెళ్ళేవాణ్ణయితే అసలు రానుగా!" మళ్ళీ నవ్వాడతను. భయంగా చూసింది సరయు.

అతను మెల్లగా ఆమెకేసి రాసాగాడు.

"వద్దు! వద్దు! రావద్దు! అన్యాయంగా నా చేతుల్లో చావద్దు" వెనక్కి వెనక్కి నడస్తూ బింకంగా అంది సరయు.

అతను ఆగలేదు. మెల్లగా ఆమెని సమీపించి ఒడుపుగా చెయ్యి పట్టుకో బోయాడు.

అంతే!

ఆమె చేతిలోని కత్తి అతని గుండెల్లోకి బలంగా దూసుకు పోయింది.




మరుక్షణం నెత్తురు ఫౌంటెన్‌లా ఆమెమీద చిమ్మడం, అతని నోట్నుంచి భయంకరమైన చావు కేక వెలువడ్డం, ఆపై అతను కుప్ప కూలి పోవడం జరిగిపోయాయి.

గభాల్న లైట్ వేసింది సరయు.

నెత్తురు మడుగులో కొట్టుకుంటున్న రమణని చూడగానే..... బిగుసుకు పోయింది.

భయంతో ముచ్చెమటలు పోశాయి.

వెన్నులోంచి ఒణుకు బయల్దేరింది.

"తనిప్పుడు ఏం చేసింది?

హత్య చేసింది!

ఒక మనిషిని నిలువునా పొడిచి చంపింది.

తను..... తను హంతకురాలు!

పోలీసులు! కోర్టులు! జైలు! వురి! అయ్యో!" భయంకరంగా అరిచింది సరయు.

అంతే!

తలుపులు విరిగేలా బాదా రెవరో.

"పోలీసులా?" కంగారుగా అనుకుంది.

మరోసారి బాదారు.

తృళ్ళిపడి కళ్ళు తెరిచింది సరయు.

బెడ్ లైట్ వెలుగులో గదంతా స్పష్టంగా కనిపిస్తోంది.

క్షణం అయోమయంగా చూసింది. ఏదో అనుమానం వచ్చినట్టు శవం కోసం చూసింది. కానీ శవం అక్కడ లేదు. కంగారుగా తనని తాను చూసుకుంది. ఆమె ఒంటిమీద రక్తమూ లేదు.

గదంతా రాత్రి పడుకోబోయే ముందెలా వుందో అలాగే వుంది. బల్లమీద మాత్రం రాత్రి యాపిల్ కోసుకున్న కత్తి మాత్రం నవ్వుతూ కనిపించింది.

ఆమెకి అంతా అర్థం అయింది.

"ఓహ్! ఇదంతా కలన్న మాట!.... థాంక్ గాడ్!" తేలిగ్గా వూపిరి తీసుకుంది సరయు.

తలుపు మరోసారి దబదబ లాడింది.

"ఇది మాత్రం కలకాదు!" అనుకుని,

"ఎవరు?" అంది కాస్త గట్టిగా.

"తలుపు తియ్యండి!"

అది రమణ గొంతు!

ఆమె గుండె వేగంగా కొట్టుకుంది.

కల గుర్తొచ్చి భయంగా చూసింది మూసి వున్న తలుపు కేసి.

"ఓసారి తలుపు తెయ్యండి!"

సరయు కేం చెయ్యాలో అర్థం కాలేదు. అప్రయత్నంగా తల్లి కేసి చూసింది.

ఆమె గాఢ నిద్రలో వుంది.

"సరయుగారూ! ప్లీజ్! ఓసారి తలుపు తియ్యండి" అసహనంగా అన్నాడు రమణ.

కలలో తను భయపడి, నిజంగా అరిచిందని, ఆ కేక అతనికి వినిపించి కంగారు పడుతున్నాడనీ గ్రహించింది సరయు.

"అయితే ఎక్కడో పక్క గదిలో వున్న అతనికి తన కేక వినిపిస్తే, తన పక్క మంచం మిదే పడుకున్న తల్లి కెందుకు వినిపించ లేదు." అన్న అనుమానం రాగానే గభాల్న లేచి లైట్ వేసి తల్లి దగ్గరికి నడిచి—

"అమ్మా!" అంది తట్టి లేపుతూ.

ఆమె పలక లేదు.

ఊపిరి భారంగా తీస్తున్నట్టు తోచింది.

కంగారుగా మరోసారి తట్టి లేపింది.

ఈసారి ఆమె పలక లేదు.

పరీక్షగా చూసిన సరయుకి గుండె ఆగినంత పనయింది. కారణం—

శాంతమ్మకి స్పృహ లేదు.

"మైగాడ్!" అని గభాల్న వీధి తలుపు తీసింది. ఇప్పుడు రమణంటే ఆమెకి

# విసర్జనం

"ఇది మికు తగదు." అని బ్రతిమాలుకుంది, విమల.

పిల్లలున్నారు. వాళ్ళని చూసయినా, వాళ్ళ కోసమయినా మి ప్రవర్తన మార్చుకొనాలి– అని ఎన్నో విధాల చెప్పి చూసింది. అలిగి కోపం ప్రకటించింది. చేతులు పట్టుకుని బ్రతిమాలు కుంది.

ఆ విషయాలన్నీ తెలిసి సుందరం విశాఖపట్నం నుండి పని గట్టుకొని వచ్చాడు. సుందరం కనకారావు గారి అబ్బాయి. స్టీలు ప్లాంటులో ఇంజనీర్‌గా వుద్యోగం చేస్తున్నాడు. ఉన్నదున్నట్టు కుండ బ్రద్దలు కొట్టి మాట్లాడుతాడు. దాపరికం లేని మనిషి. ఏంట్రాబావా! ఇది?" అని సూర్యాన్ని నిలదీసి అడిగాడు. "ఏ సంగతి నువ్వు మాట్లాడేది? ఏంటి అసలు సంగతి?"– అతనికేం తెలీదనుకుని ఎదురు ప్రశ్న వేసాడు సూర్యం, నవ్వి. "రాస్కెల్! ఇంత గొడవా చేస్తూ, ఏం జరగనట్టు నటిస్తావా? నీకు బుర్రా బుద్ధి వుందా? నువ్వు మనిషివేనా? ఛి... ఛీ. పైగా ఆ నవ్వు ఒకటా? ఒరే, ఒకసారి చెడగొట్టుకున్నాక తిరిగి పరువు ప్రతిష్టల్ని సంపాదించు కొనటం చాలా కష్టంరా. నీలో చీమూ నెత్తురూ వుంటే ఇక మరలా అలాగ ప్రవర్తించవురా"– అని పరుషంగా మాట్లాడాడు సుందరం. మొహం ఎర్రగా చేసుకుని తల దించుకున్నాడు సూర్యం.

"అమ్మాయ్! నేనలా వూర్లోకి వెళ్ళి మా ఫ్రెండుని కలిసి వస్తాను." అని సుందరం అలా వెళ్ళగానే–

"ఏమిటే! ఏమిటీ న్యూసెన్సూ? నా ఇంటికి వచ్చి, నాతో ఇలా వెధవలాగ మాట్లాడటానికి అసలు వాడెవడూ?" అని ఎగిరి పడ్డాడు సూర్యం.

"అయిన అల్లరి చాలు. ఇక వూరుకోండి" అంది విమల. కోపంతో పిచ్చెక్కినట్టు అయి, మీదపడి జుట్టు పట్టుకున్నాడు.

"జాగ్రత్త! వదలండి. ఇక నుంచి ఇలాటి పన్లు చేస్తే సహించేది లేదు!"

"సహించక ఏం చేస్తావే! కొత్తగా కొమ్ములు వచ్చాయా? ఏం చూసుకునే ఆ పొగరూ?" అని, లాగి వంగదీసి గొడ్డును బాదినట్టు బాదాడు సూర్యం.

"మిరు మనుషులా? పశువులా? అవతలికి, పొండి. నన్ను వదలండి."

"అవునే! నీ కంటికి నేను పశువులాగా కన్పిస్తున్నానా! ఎంత కండకావరమే నీకూ?"– అని ఎముకలు విరిగేటట్టు కుమ్మి, కసితీరక, చేతికి అందిన కర్ర తీసుకుని నెత్తి మిద బలంగా కొట్టి –

నెత్తుటి మడుగులో స్పృహ కోల్పోయి పడిపోయిన, విమలని వదిలేసి పారి పోయాడు సూర్యం.

స్నేహితుడ్ని కలిసి మాట్లాడుకుని, ఒక గంట తర్వాత సుందరం వచ్చేసరికి ఇంకా అదే స్థితిలో వుంది విమల. ఆ దృశ్యం చూసే సరికి సుందరం కడుపు చెరువయింది. వెంటనే విమలని హాస్పిటల్‌లో చేర్చి, కాకినాడకి ఫోను చేసి తండ్రితో మాట్లాడేడు సుందరం. ఆయన సలహా మీద–

ఆఫీసుకి విమలతో సెలవు పెట్టించి, వెంటనే– కాస్త నయం కాగానే– విమలనీ, పిల్లల్నీ తీసుకుని విశాఖపట్నం వెళ్ళాడు. ఆ సమయానికి కనకారావు గారు కూడా విశాఖపట్నం చేరారు.

అక్కడ నెల రోజులున్నాక, సుందరం వత్తిడి చేయగా విడాకులకి కోర్టులో దావా వేయటానికని కాకినాడ చేరుకుని వెంటనే ఆ పని చేసారు.

సూర్యం ప్రవర్తన భరించ లేనంతగా వున్నట్టు ఋజువయిందనీ– అందువలన విమల కోరుకున్నట్టుగా విడాకులు మంజూరు చేయటాన్కి తనకి అభ్యంతరం లేదనీ– అయితే ఇది భార్యాభర్తలకి సంబంధించిన వ్యవహారం కనుకా ఇందులో సున్నితమయిన ఇతర అంశాలు ఇమిడి వుండటం వల్లనా– ఆలోచించు కొనటానికి, అవసర మనుకుంటే రాజీకి రావటానికి కొంత సమయం ఇస్తున్నాననీ జడ్జిగారు తీర్పు ఇచ్చారు.

ఎర్రబడిన కనులతో రేగిన జుట్టుతో, లోతుకు పోయిన చంపలతో– తల వంచుకుని తీర్పుని ఆలకించిన సూర్యం నిశ్శబ్దంగా వుండిపోయాడు.




కనకారావు పలకరించినా బదులు పలక లేదు.

ఆ తర్వాత నాలుగు రోజులకే– కనకారావు గారికి విజయవాడ నుండి టెలిగ్రాం వచ్చింది.

త్రాగి, స్పృహ కోల్పోయి, స్కూటరు గుద్దుకొనగా హాస్పటల్ పాలయిన సూర్యం ఎవరో ఫ్రెండ్‌తో ఆ టెలిగ్రాం ఇప్పించాడు.

దిక్కులేని పక్షిలాగా అయిన సూర్యం మీద జాలిపడి అక్కడే భార్యా సమేతంగా వుండిపోయారు కనకారావు గారు. ఆయన అక్కడ నుంచే విమలకి నాలుగు వుత్తరాలు రాసారు.

ఉద్యోగానికి యాంత్రికంగా వెళ్ళి వస్తూ వున్నా, ఆ వుత్తరాలు విమలని కుదిపి వేసాయి. ఆ తర్వాత సూర్యం కోలుకొన్నాక, అతన్ని తీసుకుని కాకినాడ వెళ్ళాక కూడా ఆ విషయం గురించే– మరి రెండు వుత్తరాలు రాసారు కనకారావు గారు.

ఇది మూడోది, ఆఖరిది....

మనిషి మనసు కోతి వంటిది. ఆ మనసు కోతి అలవాటుకి బానిస. స్వార్థం పశుత్వం నిండిన – కోతి మనసు సరిగావటం సంభవంకాని సంగతి. ఎలుక తోకని వుతికి తెల్లబరచ బూనటం, కుక్కతోక వంకరని లాగి సరి చేయబోవటం– రిజల్టురాని అవకతవక పనులు. ఆశపడి పిచ్చి పరుగులు తీసి భంగపడటమే, నిరాశ ఎదురయిందని క్రుంగి కన్నీరు కార్చటమే– మిగులుతుందని తెల్సినపుడు– కొన్ని కాలం చెల్లిన సామాజిక పద్ధతుల్ని పట్టుకుని వ్రేలాడి, తిరిగి ఆ నరకాన్ని పీడననీ కావాలని వరించటం ఏం తెలివిగలతనం?

పోయింది పొల్లు.

అందని సంసార సుఖాన్ని గురించి బాధపడటం అనవసరం.

దుష్టాంగంబున్ ఖండించి విసర్జించటమే మేలు– అన్నారు.

పిల్లల్ని శ్రద్ధగా పెంచి, వాళ్ళని ప్రయోజకుల్ని చేసుకోవటమే ఇక మిగిలి వున్న కర్తవ్యం. తల్లిగా ఆ బాధ్యత తనకి వుంది.

ఒక భార్యగా సుఖ సంసారం చేసుకునే ప్రాప్తం తనకి లేదు.

నేలపాలయిన పాలని గురించి వగచి ప్రయోజనం లేదు.

ఏడ్చి, ఏడ్చి కన్నీరు కార్చిన చంపల్ని తుడుచుకుని– మొహం కడుక్కునింది విమల.

వెంటనే, తయారయి టెలిగ్రాఫ్ ఆఫీసుకి వెళ్ళి కాకినాడకి కనకారావు గార్కి టెలిగ్రాం ఇచ్చింది.

"నేను మరల ఈ జన్మలో సూర్యాన్ని చూడాలని కోరుకోను. కనుక ఈ పని మీద మీరు అతన్ని తీసుకుని ఇక్కడికి బయలుదేరి రావద్దు. నేను బాగా ఆలోచించుకుని ఈ నిర్ణయం తీసుకున్నాను. మానవతి, అభిమానవతి అయిన యువతిగా నా నిర్ణయం యొక్క మంచి చెడ్డల్ని నేనే ఎదుర్కొనటాన్కి సిద్ధపడ్డాను. నా నిర్ణయం మి మనసుకి ఏమయినా కష్టం కలిగించి వుంటే నన్ను క్షమించండి – విమల."

ఆ పనిచేసి ఇల్లు చేరిన విమలకి గుండెల మీద నుండి కొండంత బరువు దింపినట్టు హాయిగా అన్పించింది. □



శ్రీ రమేష్‌బాబు, శ్రీమతి లక్ష్మి.

ఇద్దరూ ఉద్యోగస్తులైతే?

# మొదటి వారంలోనే జీతం "హుష్ కాకి!"

ఎ. రమేష్‌బాబు ఢిల్లీలోని యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లో యు.డి.సి.గా పని చేస్తున్నారు. ఆయన శ్రీమతి లక్ష్మి న్యూఢిల్లీ ఆంధ్రా ఎడ్యుకేషన్ సొసైటీ వారు నడుపుతున్న డా. రమేష్‌బాబు మెమోరియల్ స్కూల్లో హిందీ టీచర్‌గా పని చేస్తున్నారు.

"ఢిల్లీ లాంటి పెద్ద నగరాల్లో ఒక్క మనిషి సంపాదన ఇంటి అద్దెకు, ఆఫీసుకు బస్సుల్లో పడి వెళ్ళి రావడానికి సరిపోతుంది. మేమిద్దరం సంపాదిస్తున్నా నెల మొదటి వారంలోనే జీతం హుష్ కాకి. ఇహ మిగిలేది లేదు. మళ్ళీ ఫస్టు తారీఖుకోసం ఎదురు చూడటమే!" అన్నారు శ్రీ రమేష్ బాబు.

"మా ఇంటి అద్దె 750 రూ. రెండు గదులు. చిన్న వంటిల్లు. చుట్టాలెవరన్నా వస్తే నుంచోడానికి కూడా చోటుండదు. మా పాపని క్రష్ బేబీ సెంటర్‌లో దింపి మేము ఆఫీసులకు వెడతాము. తిరిగి వచ్చేటప్పుడు పాపని తీసుకు వస్తాము. క్రష్ బేబీ సెంటర్ వారికి నెలకు 125 రూ. ఇస్తున్నాము. మేము ఆఫీసులకు వెళ్ళినా మా మనస్సు మాత్రం పాప ఎలా ఉందో అని పీకుతూ ఉంటుంది. క్రష్ బేబీ సెంటర్ నడుపుతున్నామె హౌస్ వైఫ్ కావడం మాకు కాస్త తృప్తి. పిల్లల సంరక్షణ జాగ్రత్తగా చూస్తారక్కడ." అన్నారు శ్రీమతి లక్ష్మి తమ సంవత్సరం పాప గురించి చెబుతూ.

"ఇక్కడ సర్వెంట్ మెయిడ్స్ దొరకరండి. దొరికినా నమ్మకంగా పని చేస్తారన్న నమ్మకం లేదు. పాపని వారి మీద వదిలేసి వెడితే ఏ అపాయమైనా రావచ్చు. అందుకనే మేము సర్వెంట్ మెయిడ్‌ను పెట్టుకోలేదు. నా శ్రీమతికి ఉదయం ఏడు గంటల నుండి, మధ్యాహ్నం రెండు గంటల వరకూ స్కూలు ఉంటుంది. ఆ తరువాత ఆమె ఫ్రీ. ఇంటికి వచ్చేదారిలోనే ఉంది క్రష్ బేబీ సెంటర్. పాపని పికప్ చేసుకుని ఇంటికి వచ్చి ఇంటి పనులు చూసుకుంటుంది. కాస్త శ్రమగాను, అప్పుడప్పుడు విసుగు కలిగినా మన పనులు మనం చేసుకుంటేనే మంచిదని పిస్తుంది. అవీ ఇవీ కొనుక్కురావాలనుకుంటే ఆఫీసు నుండి వచ్చేటప్పుడే సూపర్ బజారుకు వెళ్ళి తెచ్చేసుకుంటాము. ఢిల్లీలో మాటి మాటికి బయటకు వెళ్ళాలంటే బోలెడు దూరాభారాలు!

మా ఆఫీసు పన్నెండు కిలోమీటర్లు, మా ఆవిడ స్కూలు పది కిలోమీటర్లు ఇంటి నుండి. బస్సులు విపరీతమైన రద్దీగా ఉంటాయి. ఒక్కొక్కప్పుడు మూడు బస్సులు మారితే కాని ఇంటికి చేరలేము. పోనీ చిన్న వాహనం కొనుక్కుందా మనుకుంటే ట్రాఫిక్ ఎద్దడి విపరీతంగా ఉంటుంది. రోజూ యాక్సిడెంట్స్ చూస్తూ మన కెందుకు కష్టాలు. ఆ బస్సుల్లోనే బాగుందను కుంటున్నాము" అన్నారు రమేష్!

"తెలుగు వాళ్ళు లేని ప్రదేశంలో ఉంటున్నారు. మీకు కాలక్షేపం ఎలా అవుతోంది. సినిమాలు చూస్తూ ఉంటారా....?" అని అడిగితే!

"తెలుగు వాళ్ళు లేని ప్రదేశం అయినా చుట్టు ప్రక్కల వాళ్ళు మంచి వాళ్ళండి. ఇహ సినిమాలు చూస్తారా అని అడిగారు. ఢిల్లీలో సినిమాకి వెళ్ళిరావడానికి యాభై రూపాయలు ఖర్చవుతుంది. అయినా ఆఫీసు నుండి ఇంటికి వచ్చేసరికి అటు పొద్దు ఇటు తిరుగుతుంది. మా పాపతో ఆడుకోవడం. టి.వి. ప్రోగ్రామ్స్ చూస్తూ కాలక్షేపం చెయ్యడం. ఇల్లే సర్వస్వం అనుకోండి." అన్నారు శ్రీమతి లక్ష్మి.

శ్రీ రమేష్ భారతి విద్యాభవన్‌లో జర్నలిజంలో డిప్లమో చేశారు. పత్రికలకి ఆర్టికల్స్ రాస్తే కాస్తో కూస్తో రెమ్యూనరేషన్ వస్తుంది కదండి అంటే....

రాయాలని ప్రయత్నాలు చేస్తున్నానండి. ఇదిగో ఏరికోరి కొన్ని సబ్జెక్టులకు నేను స్వయంగా తీసిన ఫోటోగ్రాఫ్స్ అంటూ చూపించారు. మంచి ఫోటోగ్రాఫర్ రమేష్.

"నేను చేసేది ప్రభుత్వ ఉద్యోగం అవడంవల్ల సరిపోయింది. ప్రైవేటు కంపెనీ అయితే ఇంత దూరంలో ఉండటం అనవసరం. నా శ్రీమతికి కూడా త్వరలో జీతం పెరుగుతుందన్న ఆశ ఉంది కాబట్టి సరిపెట్టు కుంటున్నాము. మాకూ ఆంధ్రా వచ్చేయాలని ఉంది. ఎప్పటికి కుదురుతుందో...." అనే రమేష్ బాబు స్వస్థలం పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరు.

"చుట్టం చూపుగా వచ్చి తిష్ట వెయ్యడానికి ఢిల్లీ దగ్గరా దాపు కాదు. ఒకవేళ వచ్చినా మా కుటీరం చూసి వెంటనే రైలెక్కేస్తారు. అదొక్కటే సుఖంగా ఉంది.... మీరు ఢిల్లీ వస్తే తప్పకుండా మా ఇంటికి రండి!" అంటూ ఆహ్వానించారు రమేష్ బాబు. నేను సందిగ్ధంలో పడ్డాను....!

– కృష్ణాజీ






సీరియల్

# సర్ప యాగం

(గత సంచిక తరువాయి)

## 13

ఆ రోజు గడిచి పోయింది. సాయంత్రం ఏడు గంటల వరకు... అక్కడ చేరిన పెద్దమనుషులు గోవిందుడికీ నాగికి నడుమ ఏర్పడిన తగాదా గురించి చర్చించారు. తను ఏ పాపమూ ఎరగనంటుంది నాగి. ఆమె తప్పు చెయ్యడం కళ్ళార చూశానంటాడు గోవిందుడు. ఈ వాగ్వివాదాల తోటే ఆ రోజు గడిచిపోయింది.

ఏడు గంటలు దాటాక.... ఆ మామిడి తోటలో ఓ చెట్టు కింద పెట్రో మాక్స్‌లైట్ పెట్టుకుని, పెద్ద మనుషులందరూ సుష్టుగా భోంచేశారు. చర్చను మరుసటి రోజుకు వాయిదా వేసి..... ఎనిమిది మంది పెద్ద మనుషులూ ఆ రాత్రి పడుకోడానికి వూళ్ళోకి వెళ్ళిపోయారు. కనకయ్య, నాగి, పోలమ్మలు ఆ రాత్రి వెంకట్రాముడి పాకలో తలదాచుకున్నారు.

మరుసటి రోజు ఉదయం.... పంచాయతీ మళ్ళీ ప్రారంభమైంది. మధ్యాహ్నం వరకు చర్చలు కొనసాగాయి. ఫలితం శూన్యం. తన కొడుకుదే న్యాయమని నర్సయ్య వాదన. కాదు తన కూతురిదే న్యాయమని కనకయ్య వాదన. మధ్యాహ్నం ఒంటి గంట కావడంతో పెద్ద మనుషులు భోజనానికి లేచారు.

అవాళ నర్సయ్య పొట్టేలి మాంసాన్ని వండించాడు. పెద్ద మనుషులంతా తాము తినగలిగినంత తింటున్నారు. తాగ గలిగినంత సారా తాగుతున్నారు. కానీ వెంకట్రాముడు, గౌరి మాత్రం అక్కడ వండిన వంటల్ని తాకలేదు. ఆ పాపంలో భాగం పంచుకోవడం వాళ్ళిద్దరికి ఏ మాత్రం యిష్టం లేదు.

ఆ రోజు కూడా గడిచి పోయింది.

మాంసపు ముక్కలు అయిపోతున్నాయి. సీత తెచ్చిన వంట సరుకులు అయిపోతున్నాయి. సారా దుత్తలు ఖాళీ అవుతున్నాయి. బీడీలు తగలబడి పోతున్నాయి. కానీ పెద్ద మనుషులు మాత్రం న్యాయాన్యాయాలు తేల్చడం లేదు.

**జరిగిన కథ -10:** వెంకట్రాముడు తాను చెప్పినట్లు విరూపాక్షమ్మ పూనినట్లు నటించను ఒప్పుకోలేదని అతన్ని గొడ్డును బాదినట్లు కర్రతో చావబాదాడు నాగరాజు. వెంకట్రాముడి ద్వారా విషయం తెలుసుకున్న నర్సయ్య కడుపు భగ్గున మండింది. ఇరవై ఏళ్ల క్రితం వెంకట్రాముడి తండ్రైన సీతారాముడిని నాగరాజు ఎలా చంపించింది వెంకట్రాముడితో వివరంగా చెప్పాడు నర్సయ్య. తన తండ్రి నాగరాజు చేత చంపబడ్డాడని తెలుసుకొన్న వెంకట్రాముడు అగ్నిపర్వతమే అయ్యాడు. నాగి గోవిందుడిని వదిలేసి పుట్టింటికి వెళ్ళిపోయింది. నాగి, గోవిందుల విషయం పంచాయితీ పెట్టిస్తారు యానాది కనకయ్య నర్సయ్యలు. ఈ వ్యవహారం వెంకట్రాముడు, గౌరిలకు నచ్చదు.

అనవసరంగా... కావాలనే చర్చను పొడిగిస్తున్నారు.

తమ పబ్బం గడుపుకోడానికి, మరో రెండు మూడు రోజులు తిని తాగి జాల్సాలు చెయ్యాలనే ఉద్దేశ్యంతోటే పెద్ద మనుషులు న్యాయాన్యాయాలు తేల్చకుండా.... అనవసరంగా చర్చను వక్రమార్గం పట్టిస్తున్నారని వెంకట్రాముడికి తెలిసి పోయింది. ఆ పెద్ద మనుషులపై అతనికి చాలా అసహ్యం వేసింది.

మూడవ రోజు చర్చ ప్రారంభమైంది.

అవాళ్టికి కూడా ఆ చర్చలకు ఫలితం ఉండదని వెంకట్రాముడికి తెలుసు. అంతే గాదు... యిక ఆ పంచాయతీని పొడిగించుకుంటూ పోతే.... నర్సయ్య కనకయ్యలు మరింతగా నష్టపోతారని కూడా అతనికి తెలుసు. అయినా ఆ సాయంత్రం వరకు సహనంతో ఎదురు చూశాడు వెంకట్రాముడు.

కానీ లాభం లేకపోయింది.

వెంకట్రాముడికి ఒళ్ళు మండి పోయింది.

ఇక సహించలేక పోయాడతడు.

"మూడు దినాల్నుంచి... యీ పంచాద జరగతానే వుండాది. కానీ యింత వొరకు యేఁవీ తేల్లేదు. మూడు దినాలు కాదు... యీ పంచాద మూన్నెళ్ళు జరిగినా న్యాయం తీర్మానంగాదు. రంపు సూస్తే జానెడు. పంచాద సూస్తే బారెడు. ఐదొక రాగాన తెగేది గాదు"– అంటూ తన అసహనాన్ని ప్రకటించాడు వెంకట్రాముడు.

"అదేందిరా అట్ల మాట్లాడ్తావు? మేఁవేఁవన్నా యీడ తినేసి తిరుబాటుగా' కుచ్చొనుండాఁవా? పంచాద మాట్లాడ్తానే వుండాం గదా. యిదేం పంచాదరా దినెబ్బాట్లాంటి పంచాదల్ని యింతకు ముందు అయిద్రాబాద్లో నేనెన్నో తీర్మానం సేసినా. నేం జేసిన తీర్మానం వొగిటి ఆ మధ్య పేపర్లో పస్టుపేజీలో యడ్‌లైన్లలో వొచ్చింది......"

"మేఁవెవురూ పేపర్ సూత్లేదులే"– అన్నాడు వెంకట్రాముడు. అతడలా అనడంతో స్టేజిమీద డైలాగ్స్ మరిచిపోయి ప్రాంప్టింగ్ అందని వాడిలా యిబ్బందిగా ముఖం పెట్టాడు వీర్రాజు.

"యీ పంచాద మాట్లాడి, మాట్లాడి మాకు నోళ్ళు నొప్పులు పుడ్తావుండాయి. తన కొడుకుదే న్యాయఁవంటాడు నర్సయ్య. తన కూతుర్దే న్యాయఁవంటాడు కనకయ్య. యిద్దర్దీ న్యాయఁవే అయితే.... యింగ అన్యాయం యెవుర్ది? అంతా బాపనోళ్ళే అయితే తట్ట కింది కోడి యేఁవైనట్టు?"– అన్నాడు గురవయ్య.

"యెంతసేపు మాట్లాడినా యిది వొగ తెగే న్యాయం గాదు. జరిగిన పంచాద సాలు. యింగ యెవురింటికి వోళ్ళు పోండి. కనకయ్యా! నీ కూతుర్ని నువ్వు తీస్కపోయి, మారు మొనువు సేసుకో"– అన్నాడు వెంకట్రాముడు.

"ఆ సంగతి నాకు తెల్సులే. నా కూతురికి మారు మొనువు సెయ్యకుండా నేనెందు కుంటాను? దానికి తగినోడు యింకోసోట వుండనే వుంటాడు. అదేర

సంగతి. మూడు దినాలుగా పంచాద జరిగి యెవుర్ది న్యాయంవో యెవుర్ది అన్యాయంవో తేలకపోతే అదెట్ట? న్యాయం తీర్మానం గావాల్సిందే. పొకయాళ పెద్ద మన్సులు తేల్సలేక పోతే.... సంవురుకుండ సాంగ్యం పెట్టుకొని న్యాయం యెవుర్దో తేల్సుకొందాం"- అన్నాడు కనకయ్య.

"యేంవిరా నర్సయ్యా! సంవురుకుండ సాంగ్యం పెట్టుకుందాంవని కనకయ్య అంటుండాడు. నువ్వేంవంటావు?"- గురవయ్య అడిగాడు చీడని నోట్లో పెట్టుకుంటూ.

"యే సాంగ్యానికైనా నేను సిద్దంవే. నేను యే సాంగ్యానికీ భయపడను. తప్పు సేసినోళ్ళు భయపడాల"- అన్నాడు నర్సయ్య తన కోడలు నాగి వేపు చూస్తూ.

"తప్పు సేసినోళ్ళెవరో, తప్పు సెయ్యనోళ్ళెవురో సంవురుకుంత సాంగ్యంలో తేలిపోతాదిలే"- అన్నాడు కనకయ్య నర్సయ్య వేపు చూస్తూ.

"పోసే! నువ్వింట్లోకి పోయి దుత్తలో సంవురు పోస్కొని యీడికి తెచ్చి కాగబెట్టు"- అంటూ నర్సయ్య తన భార్య మల్లక్క వేపు తిరిగి చెప్పాడు.

భర్త అలా చెప్పగానే.... మల్లక్క గబగబా యింట్లోకి వెళ్ళి, ఓ చిన్న మట్టి పాత్రలో సగానికి పైగా వేరుశెనగ నూనెను పోసుకుని. అక్కడికి తెచ్చి... పొయ్యి మిద పెట్టి వేడి చెయ్యసాగింది.

* * * *

ఈ విశ్వంలో రాతియుగంలోని మనిషికి అపారమైన అజ్ఞానం వుండేది. ఈ విశ్వం తనకు ఏసరంత కూడా అర్ధంగాని దశలో.... ఆది మానవుడు ఈ విశ్వంలోని కొన్ని పదార్ధాలకు సంబంధించి కొన్ని విశ్వాసాలను పెట్టుకున్నాడు.

తనకు అర్ధం కాని ప్రకృతిని పవిత్రమైన ఒక శక్తిగా విశ్వసించాడు. గాలి, వెలుతురూ, నరూ, భూమ్యాకాశాలు మొదలైన వాటన్నింటిని దేవుళ్ళుగా భావించాడు. అయితే మానవుడి భావాల ఎదుగుదల అంతటితో ఆగిపోలేదు.

విశ్వపరిణామంలో అత్యున్నత స్థాయికి పరిణామం చెందిన పదార్ధం మానవుడి మెదడే. ఈ పరిణామ క్రమంలో ప్రకృతిని గురించి మానవుడు ఒకప్పుడు పెట్టుకున్న భ్రమలూ. గుడ్డి నమ్మకాలూ పటాపంచలైపోయాయి.

నేడు మానవుడి విజ్ఞానం పరాకాష్ఠ దశకు చేరుకుంది. దేవుళ్ళుగా ఆరాధించిన ఉపగ్రహాల మిద మనిషి కాలు ఊనుతున్నాడు. అయినప్పటికీ యింకా ఈ కాలంలో కొంత మంది బుర్రల్లో ఎన్నో గుడ్డి నమ్మకాలు గూడు కట్టుకుని వున్నాయి.

అటువంటి నమ్మకాలలో ఒకటి ప్రమాణాలు చెయ్యడం. తద్వారా తమ నిర్దోషిత్వాన్ని నిరూపించుకో గలమని భ్రమించడం. ఈ భ్రమల్లో ఒక భాగమే 'చమురుకుంత సాంగ్యం''. ఇలాంటి భ్రమలు అడుగు వర్గాల వారిలోనే గాక అగ్రవర్గాల వారిలోనూ ముఖ్యంగా అక్షరాస్యులలోనూ కన్పించడం విచారకరం.

భౌతిక శాస్త్ర ఆచార్యుల వంటి మేధావులే కొందరు.... ఎవరో కాకిగూడు లాంటి బుట్ట తలకాయల గాళ్ళు చెప్పిన మాటల్ని నమ్మి.... శూన్యంలోంచి పదార్ధం పుడుతుందని విశ్వసిస్తున్నారంటే.... యిక యానాదుల వంటి అనాగరికులు యిలాంటి భ్రమల్ని విశ్వసించడం అదో పెద్ద విచిత్రమయిన విషయం కాదు.

* * *



ఒక మట్టి పాత్రలో చమురు పోసి, దానిని పొయ్యిమీద పెట్టి.... వేడి చేస్తారు యానాదులు. యిద్దరి వ్యక్తుల నడుమ పోట్లాట వచ్చి, అందులో ఎవరిది న్యాయమో, ఎవరిది అన్యాయమో తేలని పక్షంలో.... ఆ యిద్దరి వ్యక్తులలో ఒకరు పొయ్యి మీద బాగా కాగివున్న ఆ చమురులో చేయి పెట్టాలి.

అప్పుడు అతడి చేయి కాలిపోకపోతే.... అతడు నిర్దోషి అని, కాలితే దోషి అని పరిగణింప బడుతాడు. ఈ తతంగాన్నె యానాదులు "చమురుకుండ సాంగ్యం" అంటారు. అయితే యానాదుల్లో ఈ చమురుకుండ సాంగ్యాన్ని యిప్పుడు ఎక్కడా ఎక్కువగా చెయ్యడం లేదు.

అయితే కేవలం యిది మౌఢ్యంతో కూడుకున్న ప్రయోగం మాత్రమే. ఎంతటి నిర్దోషైనా, సత్యవ్రతశీలుడైనా మరిగిన నూనెలో చేయిపెడితే కాలకుండా వుండదు. అసలు వాది, ప్రతివాది యిద్దరూ అందులో చేతులు పెట్టినా.... యిద్దరి చేతులూ కాలడమనేది తథ్యం.

అయితే వాళ్ళ ఆచారాన్ననుసరించి....వాది ప్రతివాదులలో మొదట ఎవరో ఒక్కరు మాత్రమే ఆ నూనెలో చేయి పెట్టాలి. మొదటగా చేయి పెట్టిన వ్యక్తికి ఎటూ కాలుతుంది గనుక.... అతడు నిజంగా దోషి కాకపోయినా అందరి ముందూ దోషిగానే నిరూపింప బడుతాడు.

మొదటి వ్యక్తి దోషిగా పరిగణింప బడుతాడు గనుక.... యిక రెండో వ్యక్తి నిర్దోషిగా పరిగణింప బడుతాడు. యిక ఆ రెండో వ్యక్తి నూనెలో చేయి పెట్ట నవసరం లేదు. అంటే.... నూనెలో మొదటగా ఏ వ్యక్తి చేయిపెడుతాడో ఆ వ్యక్తి తప్పకుండా దోషిగా పరిగణింప బడడం తథ్యమన్న మాట.

అయితే వెంకట్రాముడికి మొదట్నుంచి ఈ 'చమురుకుండ సాంగ్యం' లాంటి ఆచారాలపై ఆవగింజంత నమ్మకం కూడా లేదు. అతడి జీవితంలో చమురుకుండ సాంగ్యాన్ని మూడుసార్లు చూశాడు. చూసిన ప్రతి చోటా మొదలుపెట్టిన ప్రతి వ్యక్తికీ చేయి కాలింది. చేయి పెట్టినా కాలకుండా నిర్దోషులుగా నిరూపింపబడిన వారిని అతడింతవరకూ చూడలేదు.

"సవురు కాగిపోయింది" - పొయ్యి వద్ద నుండి వచ్చి నర్సయ్యతో చెప్పింది మల్లక్క.

"అయితే కానీయండి. యిదేందో తేలిపోతే యెవురి కొంపలకు వోళ్ళు పోవచ్చు" - అన్నాడు కనకయ్య.

"యింగేంవిరా నర్సయ్యా! యేంవిటికి మీరు గొమ్మునుండేది? కానీయండి మరి"- అన్నాడు గురవయ్య.

"మేంవు సిద్ధమే. వొరేయ్ గోయిందూ! నువ్వెళ్ళి ఆ బాయిలో మునిగేసి తడి గుడ్డలతో రావో"- నర్సయ్య అన్నాడు.

ఆయన ఆ మాట అనగానే గోవిందుడు ఆ గుడిసెల పక్కనే వున్న బావిలో స్నానం చెయ్యడానికి వెళ్ళిపోయాడు.

"నువ్వింకా గొమ్మునుండా వేంది? నాగిని కూడా స్నానం చేసి రమ్మను" కనకయ్యతో చెప్పాడు వీర్రాజు.

"వొసే! నువ్విట్రాయే" - అంటూ కనకయ్య పిలవగానే పోలమ్మ అతడి చెంతకు వచ్చింది.

"నాగిని బాయి కాడికి తోడుకొని పోయి ... నాలుక్కడవల నీళ్ళు సేది, దాన్నెత్తిన బోసి, తడి గుడ్డల్తో దాన్ని తోడుకొని రావో" - పోలమ్మకు చెప్పాడు కనకయ్య.

వెంటనే పోలమ్మ తన కూతురు నాగిని బావి వద్దకు తీసుకు వెళ్ళింది.

పది నిముషాల్లో గోవిందుడూ, నాగి స్నానాలు ముగించుకుని తడి బట్టలతో వచ్చేశారు. ఇద్దరూ మెల్లగా పొయ్యి దగ్గరకు వెళ్ళి నూనె ... పాత్రకు ముందు భాగంలో నిలబడ్డారు. ఒక మూఢాచారాన్ని నిర్వహించడానికి వాళ్ళు సిద్ధమయ్యారు. అక్కడ చెట్టు కింద వున్న వాళ్ళందరూ వాళ్ళిద్దరి వైపే ఆతృతగా చూస్తున్నారు.

"యేంవిరా అట్నే నిలబడిపోతివి? లగ్గనం రాలేదా? మంచి సగినం (శకునం) కాలేదా? నువ్వట్నే నిల్చుకో. పొద్దు బోతాది. మా కొంపలకు మేంవు బోతాం"- గోవిందుడి వేపు చూస్తూ దబాయిస్తున్నట్టుగా అన్నాడు వీర్రాజు.

గోవిందుడు పొయ్యి మీది పాత్రలోకి ఓసారి చూశాడు. నూనె బాగా మరిగి వుంది. 'అన్నింటికి ఆ దేవుడే వున్నాడు' అని మనసులోనే సత్తెమ్మ దేవతను తల్చుకుని ... ఆ నూనెలో తన చేయి పెట్టడానికి కొంచెం ముందుకు వంగాడు గోవిందుడు.

సరిగ్గా ఆ క్షణంలోనే...

"వొరేయ్ గోయిందూ!"- అంటూ గట్టిగా అరిచాడు వెంకట్రాముడు. అతడి కేక విన్న గోవిందుడు తల పైకెత్తి వెంకట్రాముడి వేపు ప్రశ్నార్థకంగా చూశాడు. ఈలోగా వెంకట్రాముడు గబగబా పొయ్యి దగ్గరకు వచ్చి గోవిందుడి చేయి పట్టుకున్నాడు.

"సంవురు కుండలో నువ్వు సెయ్యి పెట్టాల్సిన పన్లేదు"- అందరికి విన్పించేలా అన్నాడు వెంకట్రాముడు.

అతడా మాట అనడంతో ... తమ పెళ్ళాలు పరాయి మగాళ్ళతో తమ కళ్ళ ముందే పరాచికాలాడడం చూసిన మొగుళ్ళలా ... పెద్దమనుషులంతా మండిపడ్డారు.

"యేంవిట్రోయ్! నీకు పిచ్చిగానీ పట్టిందా యట్ట? ఈసారి నాతో పాటు అయిద్రాబాద్‌కు రా. ఆస్పటల్లో సేర్పించి డాక్టర్తో సెప్తా"-వేళాకోళంగా అన్నాడు వీర్రాజు.

"యీసారి అయిద్రాబాద్‌కు తంవరు యెప్పుడెళ్తారు?"- అడిగాడు వెంకట్రాముడు.

"వొచ్చే నెల్లో"

"నిజంవేనా?"

"ఆ ... నిజవే"

"అప్పుడు మర్సిపోకుండా ఆ ఆస్పటల్లో తంవరు సేరండి"-వెంకట్రాముడన్నాడు.

అతడామాట అనగానే... తన కంట్లో కారప్పొడి కొట్టనట్లయింది వీర్రాజుకు.

"కాగిన సంవుర్లో సెయ్యి పెడితే కాలదని మీకంతా యెవురు సెప్పినారు? అసలు గోవిందుడు ఆ సంవుర్లో తన సెయ్యెందుకు పెట్టాల?"- అడిగాడు వెంకట్రాముడు.

"వొరేయ్! ఆడెవుడో నీబోటోడొకడు రాత్రంతా రాంవాయనం యిని ... తెల్లారి నిద్దర్లేసి, సీత రాంవుని కేంవౌతాదని అడిగినాడంట. అట్టుండాది నువ్వు మాట్లాడేది"- గురవయ్యన్నాడు.

"మూడు దినాలుగా నువ్వీ పంచాదను యింటానే వుండావు గదా.

## శివోక్తం

(ప్రఖ్యాత కన్నడకవి సర్వజ్ఞ వచనలు ఆధారంగా)

ఆశ యెన్నడు లేదు నిరాశలేదు
హెచ్చు తగ్గుల యోచన యెప్పు లేదు
భోగవాంఛలు తనలోన పుట్టలేదు
లేదు రాగమ్ము యోగికి లేశమైన.

కోర్కెగములను మనసున కూల్చినంత
ఎచటనో కాదు కైలాస మిచటి కలదు
కోర్కెగములను మనసున కూర్చినంత
ఎచటనో కాదయ, నరకమిచటి కలదు.

ఉండి, పొట్టనిండ తినకయుండనేల
ఉండి దుస్తులు తాల్చక యుండనేల
ఉండి దానాలు చేయక యుండనేల
సిరులు దొరలకో దొంగకో చేరనేల.

– కనమలూరు వెంకట శివయ్య




# జైకిసాన్ పనితనం అద్భుతం పొలంలో పండింది బంగారం

కారణం ఏమిటంటే, ఉత్తమ శాస్త్రీయ పద్ధతిలో తయారైన జైకిసాన్ ఎరువులు నీటిలో ఇట్టే కరుగుతాయి, మొక్కలకు వెంటనే అందుతాయి. అంచేత కాస్తంత ఎరువు కూడా వృథాగా పోదు, పూర్తిగా మొక్కలకు అందుతుంది. మరి, మీరు కూడా జైకిసాన్ ఎరువులు తెచ్చుకోండి, పొలంలో బంగారం పండించండి!

**జైకిసాన్ యూరియా 46.4% నత్రజని**

స్వచ్ఛమైన తెల్లని గుళికల రూపంలో వుండే జైకిసాన్ యూరియా 46.4% నత్రజనితో సమృద్ధమైనది. ప్రతి నేలకూ, ప్రతి పంటకూ ఉత్తమమైనది.

**జైకిసాన్ సంపూర్ణ 19:19:19**

ముఖ్యంగా ప్రత్తి, వరి, గోధుమ, చెరకు మొదలైన పంటలకూ, పొటాష్ లోపం గల నేలలకూ ఉత్తమమైనది.

**జైకిసాన్ సామ్రాట్ 18:46:0**

వర్షాధార పంటలకు ఇది అతి ఉత్తమమైన ఎరువు. ప్రతి నేలకూ, ప్రతి పంటకూ అనువైనది.

సరైన సంతులిత ఎరువులు వాడితే అత్యధిక లాభాలు చేకూరుతాయి. జువారి వారి, ఉచిత భూసార పరీక్ష సేవను వినియోగించుకొని ప్రయోజనం పొందండి.













## జైకిసాన్ రాజ్యం-ధాన్యలక్ష్మి సామ్రాజ్యం

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు : సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణె, ఇండోర్, ఆగ్రా, జువారి నగర్.

LINTAS ZUA 133 2317 TL

## సర్పయాగం

యిన్నొడివి యిప్పుడు నువ్వి మాటడిగితే యింగ మేఁవు యేఁవనుకోవాల?"- అన్నాడు వీర్రాజు.

"నాగి తప్పు చేసిందని, అందుకే దాన్ని యింట్లోంచి తరిమేశానని గోవిందుడు చెబుతున్నాడు. ఇందులో తనదేమి తప్పులేదని, నాగిదే తప్పని అంటున్నాడు. గోవిందుడిప్పుడు నిర్దోషిగా నిరూపించుకోవాలి. అందుకే నూనె కుండలో గోవిందుడు చేయి పెట్టాలి"- వివరించాడు పంతులు గుర్నాథం.

"అయితే సఁవురుకుండలో సెయ్యి పెట్టాల్సింది గోవిందుడు కాదు"- అన్నాడు వెంకట్రాముడు.

"యింకెవరు?"

"నాగే తన సెయ్యి పెట్టాల."

"యిదేం యిద్దూరం"- కనకయ్య అన్నాడు.

"యిందులో యిద్దూరఁవేఁవీ లేదు."

"యిద్దూరం లేదా? యెవరికైనా యీ మాట సెప్తే నవ్వతారు"- అన్నాడు కనకయ్య.

"యిద్దూరపు మన్సులకంతా యిద్దూరంగానే కనిపిస్తాది"- అన్నాడు వెంకట్రాముడు.

"యిద్దూరం గాకపోతే యింగేందిది? నాగి ఆ సఁవుర్లో యెందుకు సెయ్యి పెట్టాల?- కనకయ్య ప్రశ్న.

"నీ కూతురు యే పాపఁవూ యెరగనంటా వుంది. తప్పు సెయ్య లేదంటా వుంది. నిజంగా తప్పు సెయ్యకుంటే ... ఆ సఁవురు కుండలో సెతిని పెట్టమను. ఆ సెయ్యిగానీ కాలకుండా వుంటే ... నాగి తప్పు సెయ్యనట్టే లెక్క"- అన్నాడు వెంకట్రాముడు.

"అవునబ్బో యిది నిజవే"- నర్సయ్య అన్నాడు.

"దీనికి నేనొప్పుకోను"- కనకయ్య అన్నాడు.

"యెందుకని?"

"యిది అన్యాయం."

"కాదు. యిదే న్యాయం."

"న్యాయఁవని నువ్వంటే సరిపోతుందా?"

"అన్యాయఁవని నువ్వంటే సరిపోతుందా?"

"అసలు గోయిందుడిది తప్పు గాకుంటే ... సఁవుర్లో సెయ్యి బెట్టనీకుండా మీరంతా అడ్డం పడడవెందుకు? సెయ్యి కాలి ... తప్పు బయటపడ్తాదని మీ బయం"- అన్నాడు కనకయ్య.

"నేను కూడా ఆ మాటే అడగతా వుండాను. నీ కూతురు తప్పు సెయ్యకుంటే ... సఁవుర్లో సెయ్యి పెట్టొచ్చు గదా. దానికి నువ్వెందుకు కాదనడం? నీ కూతురు సెయ్యి కాలి ... సేసిన తప్పు బయటపడి, పర్వు బోతాదని నీ బయం"- అన్నాడు వెంకట్రాముడు.

"యిట్టాంటి నేర్సిన మాటలు నా దెగ్గిర మాట్లాబోకె"- వెంకట్రాముడి వేపు సూటిగా చూస్తూ అన్నాడు కనకయ్య. అతడికి చాలా కోపం వచ్చింది.

"అవును. నేర్సిన మాటలే. తెలీనోళ్లకు సెప్పాల్సింది నేర్సిన మాటలే. యిప్పుడు యంకట్రాఁవుడు మాట్లాడిన మాటల్లో యేం పొరబాటుంది?"- అన్నాడు నర్సయ్య.

"అయితే మీరిప్పుడు సెప్పేదేంది? నాగి సఁవురుకుండలో సెయ్యి పెట్టాలంటారు. అంతేనా?"- కనకయ్య ప్రశ్న.

"అంతే."

"సెయ్యి పెట్టకపోతే?"

"నీ కూతుర్ని తీస్కొని పొద్దుపోక ముందే యీన్నుంచి దయసెయ్యచ్చు"- చెప్పాడు వెంకట్రాముడు.

"అంతేగానీ గోయిందుడు సఁవుర్లో సెయ్యి పెట్టడానికి మీరొప్పుకోరా?"

"ఒప్పుకునే కొచ్చినే లేదు"- ఖచ్చితంగా చెప్పేశాడు వెంకట్రాముడు.

ఇంతలో పెద్దమనుషులు ఆ గొడవలో కలగచేసుకుని ఇరువర్గాల వారిని సర్దడానికి ప్రయత్నం చేశారు. కాని ... లాభం లేకపోయింది. పెద్దమనుషుల మాటను వాళ్లెవరూ పట్టించుకోలేదు. 'ఇక మేమేమి చెయ్యలేం మీ యిష్టం'- అంటూ ఈ పెద్దమనుషులు చివరకు పైకి లేచేశారు.

"కనకయ్యా! నీ కూతురికి యింక నువ్వు మారు మొనువు (మరో పెళ్ళి) సేసుకో. గోయిందుడు కూడా యింకో దాన్ని సేసుకుంటాడు. ఈ పొద్దుట్నుంచి మీ రెండు కుటుంబాల నడుమ ఎలాంటి సమ్మందవూ లేదు"- తీర్పు చెప్పేశాడు గురవయ్య.

"యింకో మనువు సేస్తాను. యెందుకని సెయ్యను? నా కూతురికి రాజ్జెంలో యింగ యిట్టాంటి మొగోడు దొరకనే దొరకడా?"- అన్నాడు కనకయ్య గోవిందుడి వేపు చూస్తూ.

"యీ రాజ్జెం గొడ్డుపోలేదు. నా కొడుక్కి కూడా యిట్టాంటి ఆడోళ్ళు దొరకరా?"- అన్నాడు నర్సయ్య అక్కడ నిలబడివున్న నాగి వేపు చూసి.

"వొరేయ్! అయిపోయిన పెండ్లికి యింగ మేళాలేఁవిటి? యక్కడోళ్ళు ఆడకి గమ్మునే పోండి. ఈ మూడు దినాలకు తిండి కర్చు యెంత అయిందో సీతను అడిగి తెల్సుకుని యెవురెవురు యెంతెంత యియ్యాల్నో యిచ్చేయండి. నా సారాయి కర్చులు నాకు సెల్లించండి"- అన్నాడు గురవయ్య.

సీత వెంటనే ఈ మూడు రోజులకయిన వంటల ఖర్చులను లెక్కవేసింది. తను వండి వార్చినందుకు రోజుకు పది రూపాయలు తన కూలి కూడా కలిపింది. మేకపోతు, పొట్టేలూ యానాది వాళ్లవే గనక ... ఆ మాంసపు ఖర్చును మాత్రం మినహాయించి చివరకు లెక్క తేల్చి చెప్పింది.

కనకయ్య తన వాటా డబ్బుల్ని సీతకు చెల్లించి, తన వాళ్లతో పాటు వెళ్ళిపోయాడు. నర్సయ్య కూడా తన వాటా చెల్లించగా ... తీసుకున్న అప్పులో తన దగ్గర చివరకు అయిదు రూపాయలు మాత్రం మిగిలాయి. నూట తొంభై అయిదు రూపాయలతో పాటు ... మూడు వందల రూపాయల విలువ చేసే పొట్టేలిని కూడా నష్టపోయాడు నర్సయ్య.

* * * * *

పది రోజులు గడిచాయి. ఈ పది రోజుల నుండి నర్సయ్యకు మనస్సు స్తిమితంగా వుండడంలేదు. అందుకు కారణం ... పంచాయతీ ఏర్పాటు చేసి ఆర్థికంగా అతడు చాలా నష్టపోవడమే. అప్పు తీసుకున్న డబ్బంతా కేవలం మూడు రోజుల్లో మంచినీళ్లలాగా ఖర్చయిపోయింది. పొట్టేలు కూడా పోయింది.

అంటే ... మొత్తం అయిదు వందల రూపాయలు ఖర్చయింది. ఆ యానాదుల దృష్టిలో అయిదు వందలంటే తక్కువ మొత్తంకాదు. అంత డబ్బు ఖర్చయినప్పటికీ ... చివరకు వాళ్లకు ఒరిగిందేమీ లేదు. నాగరాజు దగ్గర తీసుకున్న రెండు వందల రూపాయల అప్పును ఎలా తీర్చాలో నర్సయ్యకు అర్థంకావడంలేదు.

తన పాక ముందున్న రాతి మీద కూర్చుని ఆలోచిస్తున్నాడు నర్సయ్య. పాక లోపల ఉల్లిపాయను నంజుకుంటూ సద్ది తాగుతున్నాడు గోవిందుడు. పాక ముందు కట్టివెయ్యబడిన పొట్టేలు అరుస్తోంది. దానికి తోడుగా వున్న మరో పొట్టేలు కన్పించకపోవడంతో పది రోజుల నుండి అది అలాగే అరుస్తోంది.

సరిగ్గా అప్పుడే ...

బీడి కాల్చుకుంటూ ఆ మామిడి తోటలోకి ప్రవేశించాడు వీర్రాజు. 'యింత పొద్దున్నే యెవురి కొంపల్ని ముంచడానికొస్తున్నాడో' అని వీర్రాజును చూడగానే మనసులోనే అనుకున్నాడు వెంకట్రాముడు. కాలిపోయిన బీడి ముక్కను అవతల పారేసి ... నర్సయ్య దగ్గరికొచ్చాడు వీర్రాజు.

"వొరేయ్ నర్సయ్యా!"

తలెత్తి చూసి లేచి నిలబడ్డాడు నర్సయ్య.

"కొంపలో వుంటావో, వుండవో అని అనుమానంతో వొస్తా వుండా"- అన్నాడు వీర్రాజు.

"కొంపలో వుండక యే రాజ్జెం పోతాఁవు? మాకేవన్నా పూళ్లా పుద్దేగాలా?"- అన్నాడు నర్సయ్య.

"పూళ్ళూ పుద్దేగాలూ లేకుంటా వుంటెనే మీ యానాది నాయాండ్లకు తలకాయలు దరణపై నిలాటంలేదు. యింగ అవిగాని వుంటె రైతుల్నే కూలికి పిలుద్దురు మీరు"- వీర్రాజు అన్నాడు.

"యండ్లో నిలబడినావు. ఆ రాతి మీద నీడన కూర్చో సాఁవి"- అన్నాడు నర్సయ్య.

"నీడన కుచ్చోని మీతో అడపాసలు గొట్టే దానికి (బాతాఖానీ వేసేందుకు) రాలేదురా నేను."

పాక బయట వీర్రాజు గొంతు వినపడటంతో సద్ది తాగడం ఆపి, వెలుపలికొచ్చాడు గోవిందుడు.

"యేఁవిరా గోయిందూ! ముక్కుల్దాకా సద్ది తాగినట్టుండావు. కండ్లు మూతలు పడ్తా వుండాయి. కడుపు కపిలి బాన మాదిరిగా వుంది. మూతి మీద ఆ మెతుకులు తుడ్సుకో."

వీర్రాజు వేళాకోళం చెయ్యడంతో గోవిందుడు పై గుడ్డతో మూతి తుడుచుకున్నాడు.

"యేఁవిరా నర్సయ్యా! మీరు వూళ్లొకొచ్చి శానా దినాలైంది?"- ప్రశ్నించాడు వీర్రాజు.

"మాకు వూళ్లో యేం పనుంటాది సాఁవి?"

"వొక మాట్లోనే యానాదోడనిపించుకుంటివి. మీ బోటి యానాదోళ్లు యింకో పది కాపురాలు గానీ వుండుంటే ... వూళ్లోని రైతులంతా ముంతలకు మూడు నాఁవాలు పెట్టుకొని ముస్టెత్తుకొనే దానికి పొయ్యుండాల్సిందే"- అన్నాడు వీర్రాజు.

వీర్రాజు అలా ఎందుకంటున్నాడో, రైతులకు తాము చేసిన అన్యాయమేమిటో నర్సయ్యకు అర్థంకావడంలేదు.

"వొరేయ్ నర్సయ్యా! మీ పంచాద జరిగిపోయి యీ పొద్దిటికెన్ని దినాలైందిరా?"- వీర్రాజు ప్రశ్న.

"పద్దినాలు సాఁవి."

"పద్దినాలైంది గదా. పంచాద కర్సుల కోసం నాగరాజుగారి దెగ్గిర నువ్వు యిన్నూరు (రెండు వందలు) రూపాయలు అప్పు తెచ్చుకొంటివి. అదేఁవన్నా తఁవరికి గురుతుందా?"

"యెందుకు లేదు సాఁవి. ఆ పొద్దు ఆ మారాజు అప్పియ్యబట్టే గదా కర్సుల కుపయోగపడింది"- చెప్పాడు నర్సయ్య.

"ఆ మారాజు నీకిచ్చింది అప్పు. అంతేగానీ యినాం (బహుమతి)గా కాదు. సరే ... ఆ దుడ్డును తెచ్చి ఆయనకిస్తావా?"

"యిచ్చేస్తాను సాఁవి."

"యింగెప్పుడ్రా యిచ్చేది? నువ్వు సొక్కఁవైన యానాదోడివైతే ... అప్పు తీర్సకుండా గుడ్ల మింద కోడి మాదిరిగా యింట్లోనే దూరుకోనుందువా? సేసిన అప్పును యెవుడు తీరస్తాడ్రా? మీ యమ్మల్ని యెత్తకపోయినోడు తీరస్తాడా?" బూతులు తిట్టాడు వీర్రాజు.

"తప్పయిపోయింది సాఁవి. నాలుగైద్దినాలలో ఆ దుడ్డు తెచ్చి అయ్యగోరికిచ్చేస్తాను"- అన్నాడు నర్సయ్య.

"సరే" ... అంటూ వీర్రాజు అక్కడి నుండి కొంచెం ముందుకు వెళ్లి ... పొట్టేల్ని పగ్గంతో పాటు విప్పుకున్నాడు.

"అదేంది సాఁవి! పొట్టేల్ని పట్టకపోతా వుండావు?"- అన్నాడు గోవిందుడు అయోమయంగా చూస్తూ.

"నీ కొచ్చిన్‌కు జవాబు సెప్పాలంటావా? అయితే యిను. మీరు కట్టాల్సిన అప్పుకు బొదులుగా ... యీ పొట్టేల్ని పట్టకపోతా వుండా"- తాపీగా చెప్పాడు వీర్రాజు.

"వొద్దు సాఁవి. మా బతుక్కి మిగిలింది ఆ పొట్టేలొక్కటే. అయ్యగోరి అప్పును యింకో రొండు మూడు దినాల్లో కట్టేస్తాను."- అంటూ పొట్టేల్ని పట్టుకున్నాడు నర్సయ్య.

"వొరేయ్! మీరు ఆ అప్పును రొండు మూడు దినాల్లోనైనా కట్టండి. రొండు మూడేండ్లలోనైనా కట్టండి. అదంతా నాకు అనవసరం. నాగరాజుగారి పొట్టేల్ని పట్టక రమ్మని నాతో సెప్పినారు. నేను పట్టకపోతా వుండా. మీరేదన్నా మాట్లాడదల్సుకుంటే ఆయన దెగ్గరికొచ్చి మాట్లాడండి"- అంటూ వీర్రాజు పొట్టేల్ని గుంజాడు.

"వొద్దు సాఁవి. దాన్నొదిలెయ్. అది నా పానం. యిప్పటికే వొగదాన్ని సంపుకుంటిఁవి"- అంటూ గోవిందుడు వీర్రాజుకు అడ్డం పడి ... పొట్టేలి పగ్గాన్ని పట్టుకున్నాడు.

"కడగా పోరా నీయమ్మను ... నీకు కండ్లుగానీ తిరగతా వుండాయాయేంట్రా? తన్నినానంటే .. కడుప్పగిలి, తాగిన సద్ది మొత్తం యలబారొస్తాది. నాతో తఁవాసలు పడకురోయ్"- అంటూ వీర్రాజు ఆ పొట్టేల్ని పగ్గంతో పాటు బర బరా యీడ్చుకుపోతుంటే ... ఆ యానాదులు నిస్సహాయంగా చూస్తూ నిలబడిపోయారు.

(ఇంకా ఉంది)

బొమ్మన్









## వ్యక్తిగతం



భారతదేశంలో మొట్టమొదటి నాళికా శిశువు బెంగుళూరులోని సెయింట్ ఫెలొమినా ఆసుపత్రిలో జూన్ 14న జన్మించింది. కర్నాటక రాష్ట్రంలోని హసన్‌కి చెందిన డాక్టర్ ప్రకాష్ దంపతులకు జన్మించిన ఈ శిశువు ప్రపంచంలోని నాళికా శిశువులలో 23వది. ఈ దంపతులకి వివాహం అయిన తర్వాత 10 సంవత్సరాల వరకూ సంతానం కలగలేదు. శ్రీమతి నిరుపమకి ఫాలోపియన్ ట్యూబ్‌లు మూసుకుపోయి ఉన్నందువల్ల ఆమెకి సంతానం కలిగే అవకాశం లేదని 1982లో బొంబాయిలో ట్యూబో ప్లాస్టమి ఆపరేషన్ చేయించారు. కాని అది విఫలం అయింది. శీతలీకరణ ద్వారా ఘనీభవింప చేసిన పిండాన్ని తల్లి గర్భాశయంలో ప్రవేశపెట్టే ప్రక్రియని చేయించుకోడానికి ఆ దంపతులు లండన్‌లోని బోర్న్ హాల్ క్లినిక్‌లో పేరు నమోదు చేసుకొని రెండేళ్ళు వేచిఉండాల్సి వచ్చింది. గత సెప్టెంబర్‌లో చేసిన ప్రయత్నం విఫలం అయింది. మళ్ళీ అక్టోబర్‌లో చేసిన ప్రయత్నం సఫలమై శ్రీమతి నిరుపమ గర్భం ధరించారు. ఎందుకైనా మంచిదని ఈ దంపతులు శీతలీకరణ ద్వారా ఘనీభవింప చేసిన మరో రెండు పిండాలని లండన్‌లోని ఆ క్లినిక్‌లో భద్రపరిచి ఉంచారట. భవిష్యత్తులో ఎప్పుడైనా వీరు ఇంకా సంతానం కావాలనుకుంటె ఆ పిండాలని ఉపయోగించుకోవచ్చు. సిజేరియన్ ఆపరేషన్ ద్వారా ఈ నాళికా శిశువుని బయటకి తీసారు. ఆరోగ్యంగా ఉన్న తమ బిడ్డని చూసుకుని ఆ తల్లిదండ్రులు పొందిన ఆనందం అంతా ఇంతా కాదు. దీనికి అంతా కలిపి ఆ దంపతులకి 70 వేలరూపాయలు ఖర్చు అయిందట. వారు మళ్ళీ పిల్లలు కావాలనుకొంటే ఈసారి ఒక్కో ఆపరేషన్‌కి సుమారు నాలుగు వేల రూపాయలు కన్న ఎక్కువ ఖర్చు ఉండదట. మనదేశంలో రెండవ నాళికా శిశువు బొంబాయిలోని కె.ఇ.ఎం. ఆసుపత్రిలో బహుశా ఆగస్టు నెలలో జన్మించవచ్చని ఆ ఆసుపత్రికి చెందిన డా. హిందుజా అన్నారు. ఆ శిశువు విషయంలో శీతలీకరణ ద్వారా ఘనీభవింప చేసిన పిండాన్ని తల్లి గర్భాశయంలో అమర్చే ప్రక్రియని కూడా బొంబాయి ఆసుపత్రిలోనే నిర్వహించారట. నవంబరులో కలకత్తాలో మరో ఇద్దరు నాళికా శిశువులు ఉదయిస్తారని డా. బైద్యనాథ్ చక్రవర్తి అంటున్నారు. భారతదేశంలో కూడా నాళికా శిశువుల తరం ప్రారంభం అయింది ... □

# వారఫలం

### 18-7-1986 శుక్రవారం నుండి 24-7-1986 గురువారం వరకు

★ **మేషం** : ఆదాయమున్నది. ఇటీవలి ఆర్థిక చిక్కులు తొలగిపోతాయి. కొందరకు వ్యాపారాన నూతన మార్గం చిక్కుతుంది. గ్రహానుకూలత గల వారం. రాజకీయంగా కొంత మేలైన వారం. స్త్రీలకు : సుఖ శాంతులు, ధనలబ్ధి.

★ **వృషభం** : ఉత్తర ప్రత్యుత్తరాలు అనుకూలదాయకం. వృద్ధులకు ఆరోగ్యమందు కొంత పెంపు చేకూరుతుంది. నూతన వస్తు సేకరణకు అవకాశం. వ్యాపారానుకూలం చెప్పదగిన వారం. స్త్రీలకు : శుభ కార్యానుకూలత, ఉద్యోగ రీత్యా పెంపు చేకూరగల వారం.

★ **మిథునం** : విధి విరామం లేకుండా కృషి చేసినా, ఈ వారం ఏమి సాధించలేకపోయామనుకొంటారు. రాజకీయంగా అంతకన్నా ప్రయోజనం లేకపోయిందనుకొంటారు. చేసిన ఉద్యోగ యత్నాలు ప్రయోజనరహితమయినట్లు గ్రహిస్తారు. స్త్రీలకు : కళారంగ ప్రీతి స్వల్పాదాయక మవుతుంది.

★ **కర్కాటకం** : ఆదాయమున్నది. అన్ని రంగాలలో అనుకూలం. చిత్ర నిర్మాణమందు సునాయాసంగా వసతు లేర్పడుతాయి. పెద్దలవలన మేలు చేకూరుట గమనించదగిన అంశాలు. స్త్రీలకు : క్రయ విక్రయమందు పెంపు, సర్వత్రా అనుకూలం.

★ **సింహం** : కనీసం నిత్య వ్యవహారాలకు సరిపొయెటంతటి డబ్బు అందుతుంది. చాలమందికి ఆరోగ్య లోపం చెప్పదగిన సమయం. ఒకటి రెండు వ్యవహారాలు బాధాకరమైనవాని బారి నుండి తప్పించుకో గలుగుతారు. స్త్రీలకు : విలువ గల వస్తు సేకరణకు, బంధు ప్రీతికి అనుకూలమైన వారం. గ్రహించాలి.

★ **కన్య** : ఏ వ్యవహారమయినా సులువుగా సానుకూలం చేసికొగలరు. ఎవరితోనైనా స్నేహం చేసికొని మేలు పొందగలుగుతారు. పెద్దల, ధనవంతుల ఆశ్రయం చిక్కుతుంది. రాజకీయంగా ఒక మెట్టు పైకెక్కగలరు. ఒకవేళ పదవి సంపాదనాపరులు కాగలరు. స్త్రీలకు : శుభ కార్యానుకూలత, సంఘంలో మంచి పేరు ప్రతిష్ఠలు.

★ **తుల** : మాటలతో ఏదీ తెమలదు. చేతలు కావాలి. ఇతరుల ఆశ్రయించి ప్రయోజనం సాధించలేరు. మీ కాళ్ళమీద మీరు నిలువ గలగాలి. స్థిరాస్థి పెంపు యత్నాలు కొనసాగుతాయి. స్త్రీలకు : శుభ సమయం. యత్న కార్యసిద్ధి. ఆనందం.

★ **వృశ్చికం** : చుట్టు ప్రక్కల వారి గొడవ లేకుండా చూచుకోవాలి. ఇంటికి వచ్చిన బంధు మిత్రులను ఆదరించుటతో కాలం సరిపోతుంది. ఆదాయాన్ని మించిన వ్యయం, కార్యాచరణ విలంబన. స్త్రీలకు : అనవసరమైన గొడవలు, వృథా కాలక్షేపం.

★ **ధనుస్సు** : వ్యాపారం బాగా సాగుతుందని చెప్ప వీలులేదు. కృషి లోపం చేయరాదు గాని, ఏమంత సుకరమైన 'వారం' గాదు. నూతన వ్యక్తుల పరిచయం ఒక విధంగా లాభదాయకమే. స్త్రీలకు : ఆర్థికానందం, మిత్రానుకూలం. సాంఘికంగా పేరు ప్రతిష్ఠలు.

★ **మకరం** : అధిక వ్యయానికి తగిన అయివోజు ఏర్పడుతుంది. విద్యా విషయంగా పెంపు చేకూరగల సమయం. వృత్తి యందు కూడ పెంపు చెప్పదగిన సమయం. లావాదేవీలందు అనుకూలత ఏర్పడ గల వారం. రాజకీయంగా పెంపు చెప్పవచ్చు. యత్నించి కార్యసాధన కావించుకొగలరు. స్త్రీలకు : కళా రంగాన చక్కని అవకాశాలు లభ్యం కాగలవు.

★ **కుంభం** : దాయాదుల వలన యిబ్బంది కలుగుతుంది. తెనిపోని వ్యవహారాలలో జోక్యం ఏర్పడి, తద్వారా మనోవేదనకు గురి కాగలరు. వ్యాపారమందు అంతరాయం చెప్పదగిన అంశమే. గ్రహించాలి. స్త్రీలకు : శుభ వ్యవహారాలు వాయిదా పడుతాయి. అధిక వ్యయం కూడా సంభవమే.

★ **మీనం** : అధిక వ్యయానికి గురి కాగల సమయం. చాల మందికి విద్యా విషయంగా పెంపు చేకూరుతుంది. కళా సాహితీ పరంగా కొందరకు పెంపు చెప్పదగిన సమయం. చిత్ర నిర్మాణమందు, భారీ వ్యాపారమందు పెంపు చెప్పదగిన సమయం. స్త్రీలకు : అప్రయత్న ధన లబ్ధి, గృహానందం ఆరోగ్యమందు వృద్ధి.

**విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి**

పెద్దకథ

# మిత్ర చతుష్టయం



వంగమూలం: ప్రమథ చౌధురి

తెనుగుసేత: ముక్కామల వెంకటేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

## సోమనాధ్ కథనం

మీరంతా నన్ను 'ఫిలాసఫర్' అంటూ ఎగతాళి చేస్తూ వుంటారు. అంటే నష్టమేమిటి లెమ్మని నేను పట్టించుకోను. కవిత్వానికి స్త్రీ ఆధారం. మరి నేను కవినికాదు గదా! ఫిలాసఫీని ఆశ్రయించాను. బాల్యంలో గానీ, కౌమారంలో గానీ, చివరకు యవ్వనంలో సయితం ఆడదానిపై నా దృష్టి పోలేదు. ఆ జాతి నామనస్సును గాని ఇంద్రియాలను గాని ఎన్నడూ సృజింపలేదు. స్త్రీని చూసి నేనెన్నడూ ద్రవీభవింపనూ లేదు ఘనీభవింపనూ లేదు. స్త్రీ జాతి పట్ల నాకు ప్రేమా లేదు, భయమూ లేదు. ఒక్క ముక్కలో చెప్పాలంటే వాళ్ల పట్ల నేను నిర్లిప్తంగా వుండేవాణ్ణి. భగవంతుడు నన్నీ భూమ్మీదకు ఎందుకు పంపాడో తెలీదు గాని నాయికాన్వేషణకు మాత్రం గాదు. కాని సాధారణ మానవుల మనసులపై నారి ప్రభావం ఎంత విస్తారంగా, లోతుగా, గాఢంగా పడుతుందో నాకు బాగా తెలుసు. లోకంలో నారివేట ఎంత సిగ్గుమాలినదో కావ్యాల్లో నాయిక పూజకూడా అంత హాస్యాస్పదంగా నాకనిపిస్తుంది. పశు పక్ష్యాది ప్రాణుల్లో గల ప్రవృత్తిని కవీశ్వరులు రాగాలలో ముంచి, వుపమానాలతో గుచ్చి, ఛందస్సులో నర్తించి మోహినీ శక్తిగా కీర్తించి వుండకపోతే మానవులింతగా బానిసలయి పోయి వుండేవారు కాదు. మనిషి తాను చెక్కిన దేవునికాళ్లపై తానే పడడం చూస్తే నాస్తికులు నవ్వడమే కాకుండా ఏడుస్తారు కూడాను. ఈ ఎటర్నల్ ఫెమినైన్ వుపాసనే మనిషి జీవితాన్ని కామెడీగానూ ట్రాజెడీగానూ మారుస్తోంది. మనిషిలో మారు మూలల్లో దొక్కునివున్న వృష్ణవాంఛ నారి పూజకు మూలమని మీరెన్నడూ ఒప్పుకోరు. పశు పక్ష్యాది ప్రాణుల్లో లోపించి మనుషుల్లో ప్రకోపించిన సౌందర్య జ్ఞానమే నారిపూజకు మూలమని మీ అభిమతం, జ్ఞానమనేది మనోధర్మం, శారీరకంగాదు. ఈ విషయంలో మీతో నేనెన్నడూ ఏకీభవించలేను. ఈ సౌందర్య రూపం దర్శించడంలో మీరో, నేనో అంధులమయి వుండాలి.

ప్రకృతిలోని జడప్రకృతుల్లో ఏ పదార్థానికీ యదార్థరూపం లేదని నా నమ్మకం. ప్రకృతి శిల్ప చాతుర్యానికి ఈ బ్రహ్మాండ సృష్టి ఓ సజీవ సాక్షి. సూర్య చంద్రాదులు మొదలుకొని వుల్క వరకు అన్నీ ఒక మూసలో పోసి చేసినవే. అన్నీ గోళాకారాలే. పూర్తిగా గోళాలు కావు. కొద్ది హెచ్చు తగ్గులతో వంకరటింకర్లు వున్నాయి. ఈ పృథ్విలో సర్వాంగ సుందరమయిన ప్రతిది మానవ నిర్మితమే. ఏథెన్స్‌లోని పార్థెనాన్ మొదలు ఆగ్రాలోని తాజమహల్ వరకు దీనికి ప్రబల తార్కాణాలు. తమ ప్రేయసి బృందాన్నంతా విధాత ఏకాంత నిర్జన స్థలంలో సృష్టిస్తాడని కవీశ్వరులు భావిస్తారు. కాని ఏకాంత నిర్జన స్థలంలో విధాత సృష్టించిన ఏ ప్రేయసి కూడా గ్రీకు శిల్పులు మలచిన పాషాణ శిల్పానికి సాటిరాదు. మీకంటే సౌందర్య జ్ఞానం నాలో అధికం కావడం వల్లనే ఏ నారిమణీ రూపలావణ్యంతో నాలో హృద్రోగం సృష్టించలేదు. ఈ స్వభావం, పరిజ్ఞానం వుండి కూడా జీవన పథంలో ఎటర్నల్ ఫెమినైన్‌ను తప్పించుకో లేక పోయాను. అలాగని నేనెవరినీ వెంటాడ లేదు. నన్నే వరించి వచ్చింది. స్త్రీ పురుషుల పరస్పర కాంక్షకు గల మానవ దేహాల్లోనూ లేదని, వారి అంతరంగాల్లో అంతకంటే లేదని ఆమె ద్వారానే పాఠం నేర్చుకున్నాను. ఆ పరస్పర కాంక్షతో ఓ రహస్యం వుంది. ఆ ప్రేమ "బోత్ ఎ మిస్టరి ఎండ్ ఎ జోక్"

ఓసారి లండన్‌లో నెల్లాళ్లపాటు నిద్ర లేమికి గురయ్యాను. ఇల్‌ఫ్రాకోంబె వెళ్లమని డాక్టరు సలహా యిచ్చాడు. ఇంగ్లాండులోని పశ్చిమ సముద్ర గాలి మనుషుల్ని మత్తెక్కిస్తుందని విన్నాను. ఆ గాలి స్పర్శలో మేల్కొనడం అసంభవం. ఆ రోజే ఇల్‌ఫ్రాకోంబె వెళ్లాను. ఆ యాత్రలో కొత్తలోకంలో ప్రవేశించాను. ఆ ప్రాంతంలోని అతి విలాసవంతమయిన హోటల్లో దిగాను. ఆ హోటలంతా దొరలు, దొరసానులతో నిండి పోయింది. అడుగు పెట్టడానికే ఖాళీ లేదు. ఆ భయంతో రోజంతా బయటే గడిపేవాడిని. అందులోనూ వసంతరుతువు. ప్రాణ స్పర్శతో జడజగత్తంతా పులకరించి నట్టయింది. అలౌకిక ప్రకృతి సౌందర్యానికి అవధి లేదని పించింది. ఆకాశమంతా బంగారు కాంతి పూత పులుముకున్నట్టు, భూమి ముఖమల్ దుప్పటి కప్పుకున్నట్టు, ఎదురుగా వజ్ర వైఢూర్యాలను తలపింప జేసే సాగర కెరటాల నురుగు, కుడి ఎడమల ఒత్తుగా వికసించిన రంగు రంగుల పూలగుత్తులు వసంత వర్ణాన్ని గాలికి సయితం అద్దినట్లు వున్నయి. సహజ ప్రకృతిలో లోపించిన వర్చస్సు వసంత వర్ణంలో పరిపూర్ణ మయినట్టుంది. అనంతాకాశంలో అవధుల్లేని ఆ ప్రకృతి సౌంధర్యానికి రెండు రోజుల్లోనే అప్పుణ్ణియాను. జీవితంలో ఆ ప్రకృతి సాంగత్యం మినహాయించిమరేమీ అవసరమని పించలేదు. అక్కడ పరిచితు లెవరూ లేని కారణంగా చొరవతో స్నేహితుల్ని చేసుకోవడం స్వభావం కాకపోవడం వల్లా రెండు మూడు రోజులు మనుష్య ప్రాణితో మాటాడి ఎరగను.

ఓ నాటి రాత్రి డిన్నర్‌కు వెళుతోండగా వరండాల్లో ఎవరో "గుడీవినింగ్" అన్నారు. తీరా చూస్తే ఓ మహిళ దారి తొలిగి నిలబడి వుంది. వయసు యాభైకి తగ్గదు. మాంచి ఒడ్డూ పొడుగూ వుంది. నల్లని శాటిన్ గౌన్ వేసుకుంది. చేతికి జిగేల్‌మనే రంగురంగుల వుంగరం వుంది. ఆమెను చూడగా ధనాభావం లేనిదానిలా కన్పించింది. పట్టుమని రెండు ముక్కలు మాటాడి పరిచయం చేసుకుందో లేదో నన్ను డిన్నరుకు రమ్మని బలవంత పెట్టింది. సభ్యతగా వుండదని అంగీకరించాను.




## మిత్ర చతుష్టయం

డైనింగ్ హాల్లో ప్రవేశించి టేబుల్ వద్ద కూర్చోగానే ఓ గజేంద్రగామిని మమ్మల్ని సమీపించింది. ఆమెలా ఆజానుబాహువులూ, స్థూలకాయులూ ఆ దేశంలో అరుదు. శరీరం మీద పైనుండి కిందివరకు తెల్లని తెలుపేగాని మరో రంగు కనబడలేదు. దేవలోకం నుండి శ్వేతహస్తి స్వర్ణ శృంఖలాలు బేధించుకుని వచ్చినట్టుగా వుంది. ఏమీ పాలుపోని స్థితిలో వుండగా నవపరిచిత ప్రౌఢ కుర్చీలో నుండి లేచి శ్వేత స్థూపాన్ని చూపిస్తూ "ఈమె నా కుమార్తె, మిస్ హెల్‌డౌషెయిమెర్. ఈయన మిస్టర్.... ?" అంటూ పరిచయం చెయబోయింది.

".... సోమ్‌నాధ్ గంగోపాధ్యాయ్."

"మిస్టర్ గ్యాంగో .... గ్యాంగో... గ్యాంగో!" అంతకు మించి నా పేరు వుచ్చరించలేక పోయింది. ఆమెతో కరచాలనం చేసి కూర్చున్నాను. జెల్లీలో చెయ్యి ముంచి తీసినట్టయింది. భోజనం ఆరంభ మయింది. బహువిధాలా సురుచికర భోజనాన్ని ఆస్వాదిస్తున్నాం.

తింటూనే యువతిని బాగా పరిశీలనగా గమనించాను. ఆమె వెడల్పాటి కళ్ళు సజలంగా, నిస్తేజంగా వున్నయ్. ఆ కళ్ళను చూస్తే శితేశ్ వశీభూతుడై వుండేవాడు. సేన్ కవిత్వం రాయడం ఆరంభించేవాడు. మీ భాషలో చెప్పాలంటే వీటిని విశాల నయనాలు, తరళ నయనాలు, కరుణ నయనాలు ఇంకా ప్రశాంత నయనాలు అని వర్ణించాలి. కాని వీటిలో నాకు పెంపుడు జంతువుల కళ్ళు మాత్రమే కన్పించాయి. వాటిలో అంత దీప్తి లేదు, స్ఫూర్తి లేదు. ఆమె పక్కన కూర్చున్నంత సేపు నాకు ఒళ్ళు జలదరించినట్టే వుంది. ఆమె తల్లితో మాటాడుతోంటే మనసుకు కూడ కంపరం పట్టుకున్నట్టయింది. ఆమె నన్నెందుకు ఆహ్వానించిందో తెలుసా! హైందవ వేదాంత సంస్కృతులను చర్చించడానికి! మన సంస్కృతిని గురించి నాకు తెలిసింది చాల తక్కువ. వేదాంతంలో అసలే ప్రమేయం లేదు. కాని యూరోపియన్ స్త్రీ సమక్షంలో నాలేమిని అంగికరించడం అవమాన మనిపించింది. ఆమె చర్చ ప్రారంభించింది. నేను అసత్యాలు నూరిపోయడం ఆరంభించాను. ఉపనిషత్తులు, వేదాలూ, భగవద్గీత, బౌద్ధ ధర్మం ఇవన్నీ ఒకటేనా అని ఆమె ప్రశ్నించే సరికి నాకు పచ్చి వెలక్కాయ మింగినట్టయింది. ఈ విషయాల్లో మా పండిత సమాజాల్లో విభిన్నాభిప్రాయాలున్నాయని ఎంతసెపూ అదే ఏకరువు పెట్టాను. నా సమాధానాలు ఆమె తలకెక్కాయో లెదో గాని పక్క టేబిల్ దగ్గర కూర్చున్న ఓ స్త్రీ తదేకంగా మా సంభాషణ వినడం గమనించి తత్తరపడి పోయాను.

విశాల వదనంతో పక్క టేబిల్ దగ్గర కూర్చున్న ఆ స్త్రీ మరో పురుషునితో డిన్నర్ ఆరగిస్తోంది. పక్కనున్న పురుషుని ముఖం చర్మం వొలిచినంత ఎర్రగా వుంది. అతను చేసే సంభాషణంతా అతని గుబురు మీసాల్లోనే దాక్కొని బయటకు వినిపించడంలేదు. కనీసం ఆమె అయినా ఆ మాటలు వింటోందో లేదో! ఆమె మా వైపు ముఖం తిప్పి చూడకపోయినా మా మాటలే వింటోందని అనిపించింది. అడిగిన ప్రశ్నకు నేను సమాధానం చెప్పడం ఆరంభించగానే ఆమె ఆహారం తీసుకోవడం మాని మా మాటలు వినాలని కుతూహలపడేది. సమాధానం చెబుతున్నంత సేపూ ఆమె కనుల్లో ఆసక్తి కనబడేది. నిజానికి మా సంభాషణ ఆమే బాగా ఆనందిస్తోంది. ఆ డిన్నర్ కర్మకాండ నుండి ఎంత వేగిరం బయటపడతానా అనిపించింది. డిన్నర్ ముగించి అంతా లేవడం చూసి నేనూ లేవబోతూండగా "మీ హిందూ ధర్మ చర్చవల్ల నేనెంతో నేర్చుకున్నాను ఇహ మిమ్మల్ని వదలను" అంది ఆ విదేశీ బ్రహ్మవాదిని - గార్గి నిజానికి వుపనిషత్తులే నాకు ఔషధమూ, పత్యమూ.

"నీ ముఖం చూస్తుంటే నాకే మందూ అవసరమనిపించడంలా" అనుకున్నాను లోలోపల" జర్మనీ పరిశోధనాలయంలో తయారయిన వేదాంత ఔషధం నువ్వెంత సేవించినా నాకు బాధలేదు కాని, పరిమాణాన్ని నేనెందుకు సూచించాలి?" అని కూడా అనుకున్నాను. ఆమె మాటాడుతూనే వుంది. "నేను జర్మనీలో డినెస్‌సెన్ వద్ద వేదాంతం చదివాను. కాని నాకు తెలిసినంతలో నాలుగవ వంతు కూడా మా గురువు గారికి తెలీదు. వేదాంతం అధ్యయనం చెయ్యడమంటే ఆలోచనా హిమాలయాన్ని అధిష్టించడం.

శంకర్ జ్ఞానోన్నతిలో గౌరిశంకర శిఖరం వంటివాడు. దానిలో వున్న శాంతి, సంయమనం, స్వచ్ఛత. ఔన్నత్యం వూహించుకుంటేనే మతిపోతుంది. . హిందూ దర్శనశాస్త్రం ఉన్నతమయిందనే గానివిస్తృతమయిందని నాకు తెలీదు. మీ దగ్గరున్నంది ఈ శాస్త్రానికి సంబంధించిన పుస్తకాల, పండితుల పేర్లు కావాలి".

ఆమె అలా అనేసరికినా ప్రాణం ఇరకాటంలో పడింది. అబద్ధాలాడితే అన్నీ అరిష్టాలే. ఎన్నో గ్రంథాల పేర్లు చెప్పాను. అందులో ఏ ఒక్కటీ శాస్త్రంకాదు. ఎందరో పండితుల పేర్లు చెప్పాను. వారంతా సజీవులే కాని ఒకరూ పండితులుకారు. నా పరిచయంలో వున్న గురువులు, పురోహితులు, దైవజ్ఞులు, కులజ్ఞులు, ఆచార్యులు, అవధాన్లు చివరకు దినవారాలు పెట్టే మామూలు బ్రాహ్మలంతా నా మాటల్లో మహాపండితులు, భాష్యకారులుగా మారిపోయారు. ఆ సంకటావస్థలో ఏమి చెయ్యాలో పాలుపోని స్థితిలో పక్క టేబిల్ దగ్గర కూర్చున్న ఆ స్త్రీ చాటంత నవ్వుతో నన్ను సమీపించి "మీరిక్కడకెలా వచ్చారు? కులాసానా? చాల రోజుల్నుండి మిమ్మల్ని చూడ్డం పడలేదు. పదండి పక్క గదిలోకి వెళదాం. మీతో చాలా మాట్లాడాలి" అంది.

ఆమె మాటలకు అవాక్కయిపోయి మెల్లగా ఆమెను అనుసరించాను ఆమె శరీర సౌష్టవమూ, నడక తీరూ చూస్తే ఆకలిగొన్న చిరుతపులి జ్ఞాపకం వచ్చింది. చేతికందిన ఫలాన్ని తన్నుకుపోయినట్లుగా గార్గి, ఆమె కన్య నోళ్ళు తెరచుకుని మా వంకే చూస్తుండిపోయారు.

డ్రాయింగ్ రూంలో ప్రవేశిస్తూనే "గంట సేపటి నుండి మీ ఇరకాటం గమనిస్తున్నాను. ఆ జర్మన్ పశువుల్నుండి మిమ్మల్ని రక్షిద్దామని ఇలా పిల్చుకు వచ్చాను" అంది ఆ స్త్రీ కంఠం.

"మీకు తప్పిన గండం ఎంత భయంకరమయిందో మీకు తెలీదు తల్లి వేదాంత చర్చ ముగియగానే కూతురి కవిత్వ చర్చ ఆరంభమయ్యేది

"ఆ నంగనాచి జాణల సంగతి మీకు తెలీదు ఏదో విధంగా పురుషుల్ని వలలో వేసుకోవడమే ఆ నారి రత్నాల లక్ష్యం. పురుషుల్ని చూడగానే వాళ్ళ నోళ్ళూరుతాయి. కళ్ళు చెమ్మగిలతాయి చూట్టానికి అందగత్తెలేలే" అంది మళ్ళీ.

"మీకెంతో రుణపడి వున్నా. మీరేదో గండమన్నారో ఆ విషయంలో నాకు భయంలేదు".

"ఎందుకని?"

"వాళ్ళనేగాదు. స్త్రీజాతి యావత్తు నుండి నేను విముక్తుణ్ణి."

"మీ వయసెంత?"

"ఇరవైనాలుగు"

"ఇంతవరకూ ఏ స్త్రీ మీ దృష్టిన పడలేదా? మనస్సు నాకర్షించలేదా?"

"లేదు."

"అబద్ధాలాడటం కళగా నేర్చుకున్నారని ఇంతకు ముందే రుజువయ్యింది "

"ఇబ్బందిలో పడి"

"అయితే ఏ ఆడదాని కళ్ళూ మిమ్మల్ని ఆకర్షించలేదా? ఇన్నాళ్ళూ!"

"నిజంగా లేదు. ఆ నయనాకర్షణలను, మనో వశీకరణలను శాశ్వతంగా ఒకామె జయించి వేసింది."

"అసూర్యంపశ్య!"

"లోకంలో ఆమెకు సాటిలేదు."

"మీ కళ్ళకా?"

"కాదు కళ్ళున్న ప్రతి వాళ్ళకూ"

"ఆమెను ప్రేమించారా?"

"అవును. ప్రేమించాను"

"ఆమె మిమ్మల్ని ప్రేమించిందా?"

"లేదు"

"ఎలా తెలుసుకున్నారు?"

"ఆమెకు ప్రేమించే శక్తి లేదు"

"ఎందుకని?"

"ఆమెకు హృదయంలేదు"

"అది తెలిసి కూడా ఆమెను ప్రేమిస్తున్నారా?" "తెలిసి కూడా కాదు. తెలిసే ప్రేమిస్తున్నాను. మరొకరు మన్ని ప్రేమించడం ప్రమాదకరం"

"ఆమె వూరూ, పేర్లూ తెలుసుకోవచ్చా?"

"తప్పకుండా ఆమె వూరు పేరిస్. పేరు వీనస్ డి మిలో"

ఈ జవాబు విని నా కొత్త స్నేహితురాలు నోరు వెళ్ళబెట్టింది.

నవ్వుతూ "చతుర సంభాషణ మీకెవరు నేర్పారు?" అంది.

"నా మనసు"

"ఎక్కడ సంపాదించారా మనసు?"

"జన్మతో"

"ఇహ ఈ మనసు మారదనా మీ వుద్దేశం?"

"ఈ నమ్మకం వమ్మయ్యే సంఘటన ఏదీ జరగలేదు"

"ఒకవేళ వీనస్ డి మెలో పునర్జన్మ ఎత్తితే?"

"నా భ్రాంతి తొలగిపోతుంది"

"మాలో ఎవరైనా శిలా ప్రతిమగా మారితే?"

ఆ ప్రశ్న వింటూనే ఆమె ముఖం ఓసారి పరిశీలనగా చూశాను. శిలాప్రతిమను చూసిన నా కళ్ళకు ఆమె రూపం అపురూపమూ అనిపించలేదు, కురూపమూ అనిపించలేదు.

ఆమె ముఖం నుండి కళ్ళు మళ్ళించి "అలాగయితే పూజిస్తాను" అన్నాను

"పూజేకాదు దాసోహం!"

"సరే! అదే అనుకోండి"

"మీరింత వదరుబోతని ముందే తెలిస్తే వాళ్ళ బారి నుండి రక్షించేదాన్నే కాదు. జీవితావగాహన లేనప్పుడు వాగడం కొందరి కలవాటు. బుద్ధిమంతుడిలా నోర్మూసుకొని ఛెస్ ఆడండి" అంది.

నేను సందేహించడం చూసి "ఆ గండం నుండి మిమ్మల్ని కాపాడింది మీ క్షేమం కోరి కాదు నా క్షేమం కోరి. ఛెస్ ఆడటం నాకు వ్యసనం ఇది మీ దేశం ఆట. మీకు బాగా వచ్చి వుండాలని పట్టి తీసుకొచ్చాను" అంది.

"తరువాత మరొకరు వచ్చి మీరు భారతదేశ వాసులు గదా! నాకు భానుమతి మ్యాజిక్ నేర్పండి అంటారు" అన్నాను.

నా జవాబుకు ఆమె నవ్వుతూ "మీరేమీ మన్మథులు కాదు. హోటల్లో స్త్రీలంతా మిమ్మల్ని



చేజిక్కించుకునేందుకు. నా దగ్గర్నుండి మిమ్మల్ని మరొహరు లాక్కుపోతారనే భయం మీ కనవసరం. నిజంగా మీకు మ్యాజిక్ తెలిస్తే, మేమే మీ వశమవుతామని మేం భయపడాలి".

హిందూ, ధర్మశాస్త్రాలు తెలుసని ఈసారి ఇబ్బందిలోపడ్డాను. మళ్ళీ ఎందుకని "నాకు చెస్ రాదు" అన్నాను.

"ఒక్క చెస్ అనే ఏమిటి? లోకంలోని చాల ఆటలు మీకు తెలీవనుకుంటాను. అయినా మీకెందుకు భయం? పట్టి తీసుకొచ్చిన దాన్ని అన్ని ఆటలూ నేర్పుతాను "

ఇద్దరం చెస్ ఆటలో కూర్చునిపోయాం. నా కొత్త మిత్రురాలు చెస్ ఆటలో ఏ దళాన్ని ఏ పేరుతో పిలుస్తారో, ఎలా నడిపించాలో ప్రవాహంలా చెప్పుకు పోతోంది నిజానికి అవన్నీ నాకు తెలిసినవే. ఆమెతో మాటాడటం ఇష్టంలేక అలా అన్నాను. మగవాళ్ళతో అంత నిస్సంకోచంగా, అంత సహజంగా మాటాడే ఆమెలాంటి స్త్రీని నేనంతవరకూ చూడలేదు. ఏ దేశం వాళ్ళయినా సాధారణ స్త్రీలు అంత మనసిచ్చి మాటాడలేరు. పురుషుల్ని స్నేహితుల్నిగా భావించి సంభాషించే స్త్రీని మొదటుగా ఆమెలోనే చూశాను ఆమెలో సిగ్గు ముసుగు లేకపోవడం చూసి సంతోషించాను. ఆ కారణంగా ఆమె సుదీర్ఘ శిక్షణ నాకు అభ్యంతరమనిపించలేదు తలవంచుకుని అనర్గళంగా ఆమె చెప్పుకు పోవడమే గమనించాను గాని మధ్య మధ్య ఆమె ఎంతోసేపటి నుండి గుమ్మం వైపు చూస్తోందో నేను కనిపెట్టలేదు. గుమ్మం వైపు చూడగా డిన్నర్ సమయంలో ఆమెతో వున్న పురుషుడు చిరాగ్గా పచార్లు చేస్తున్నాడు అతని నొసటిలో ముట్లు, ముఖంలో కోపం వున్నయ్. నేనేగాక ఆమె కూడ చూసే వుంటుంది. అతని మనసులో ఏదో కల్లోలం రగుల్తున్నట్టు కనపడింది. చెస్ బలాబలాల పరిచయంలోనే అరగంట గడచింది. నెమ్మదిగా ఆట ఆరంభమయింది.ప్రతిఘటనలో

# మిత్రచతుష్టయం

ఇరువురమూ ఘటికులమేనని ఐదు నిముషాల్లోనే తెలిపోయింది ఒక్క ఆట పూర్తి కావడానికే ఒక రాత్రి పట్టేలా అనిపించింది. అడుగు ముందుకు వేయడానికి ఐదేసి నిముషాలు ఆలోచిస్తూ కూర్చుంటే ఆటకు ఎంత సమయం పడుతుందో ఆలోచించండి. ఓ గంట తరవాత పచార్లు చేస్తున్న పెద్దమనిషి కోపంగా లోపలకొచ్చి విరక్తి భావంతో ఆమె నుద్దేశించి "అయితే నేనొస్తాను" అన్నాడు

ఆ మాటకు ఆమె అన్యమనస్కంగా 'అప్పుడేనా?" అంది.

"రాత్రి 11 అయింది తెలుసా?" అన్నాడు

"అలానా ఐతే వెళ్ళు మరింక ఆలస్యం చెయ్యకు ఆరు మైళ్ళు గుర్రపు స్వారీ చెయ్యాలి "

"రేపొస్తావా?"

"తప్పకుండా చెప్పానుగా. పదింటి లోపలే వచ్చేస్తాను "

"మాట నిలబెట్టుకుంటావా?"

'బైబిల్ మీద ఒట్టేసి చెప్పనా!"

"గుడ్‌నైట్"

"గుడ్‌నైట్"

అని అతను వెళ్ళిపోయాడు. మళ్ళీ ఏదో మరచిపోయినట్టున్నాడు తిరిగివచ్చి "ఈ చెస్ దాసత్వం ఎప్పట్నుంచి?" అన్నాడు.

"ఇవ్వాళ్టి నుండి'

"అలాగా!" అని హుంకరిస్తూ ఆ శ్వేత జాతీయుడు వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళి వెళ్ళగానే ఆమె **చెస్** బోర్డు నిర్లక్ష్యంగా పక్కకు తోసి గలగలా నవ్వనారంభించింది. ఆమె నవ్వుతోంటే పియానో చరమ స్థాయిలో వాయించినట్టుంది దాంతో నా మనఃస్థితి కూడ ఆనందంతో ఓ స్థాయి పెరిగింది.

"మీతో చెస్ ఆడటంలోని ఆంతర్యం ఇప్పుడు బోధపడిందా?"

"లేదు"

"అతన్ని వదిలించుకోవడానికి' జార్జి వంటి వ్యక్తులతో రోజంతా గడిపితే మనస్సుకు, శరీరానికి కూడ మహ బోరుగా వుంటుంది అతని సంభాషణ వింటూ కూర్చోవడం, నల్లమందు తినడం రెండూ ఒకలాగే ఉంటాయి".

"ఎందుకని?"

"అన్ని విషయాల్లోనూ అతనికి అభిప్రాయాలున్నాయి. గాని మనసు లేదు. అతన్లో సారం వుంది గాని రసంలేదు. స్త్రీకి భర్తగా రాణిస్తాడు గాని ప్రియుడుగా మాత్రం పనికిరాడు."

"అంటే? భర్త కూడా స్త్రీకి చిరకాల ప్రియుడేగా!"

"చిరకాల ప్రియుడయినా ఒక్కనాటికి సిసలయిన ప్రియుడు కాలేడు. అదే జరుగుతుంది. నిజానికి జరిగింది కూడా!"

"అయితే పరిపూర్ణమయిన భర్తకు వుండవలసిన లక్షణాలేమిటి?"

"వాళ్ళ శరీరాల్లోనూ, చరిత్రల్లోనూ జీవన భారాన్ని అవలీలగా మోసే శక్తి వుంటుంది. వాళ్ళ ప్రకృతి సరిగ్గా మీకు వ్యతిరేకం. వాళ్ళకేవీ అభిప్రాయాలుండవ్. పనిచేసుకుంటూ పోతారు. ఒక్క మాటలో చెప్పాలంటే వాళ్ళు సమాజానికి మూలస్తంభాలు. మీలా గృహాన్నలంకరించే చిత్తరువులూ, బొమ్మలూ కాదు."

'ఈ రెండు క్షణాల్లోనే మా సారం కనిపెట్టేసినట్టున్నారే"

"నా కళ్ళల్లోకి సూటిగా ఒకసారి చూడండి. మీకే తెలుస్తుంది. ఇతరుల మనస్సుల్లోకి చొచ్చుకుని పోయే కాంతి వాటికుంది."

ఆమె కళ్ళల్లోకి తీక్షణంగా ఓసారి చూశాను. నిజంగానే ఆమె కళ్ళల్లో "లౌసానియా" వుంది. లౌసానియా ఓ రకమైన రత్నం. ఆంగ్లంలో దాన్ని కాట్స్ ఐ అంటారు. దాని మీద కాంతికిరణం పడటంతోనే అసలు రంగు మారిపోతుంది. ఆమె చూపులోని కాంతి నా కళ్ళ ద్వారా హృదయానికి చేరుతుందేమోననే భయంతో దృష్టి మరలించాను.

"నాకు మర్మభేది దృష్టి వుందని ఇప్పుడయినా ఒప్పుకుంటారా?"

"నమ్మినా నమ్మకపోయినా ఒప్పుకోవడానికి నాకు అభ్యంతరంలేదు"

"మీకూ జార్జికి ఓ వ్యత్యాసం వుంది. అతను సూటిగా ఒకే దిక్కుకు పోయే నౌకలాంటివాడు. మీరు అటూ యిటూ వూగిసలాడుతూ పోయే మత్తగజం వంటివారు."

"ఇద్దర్లో ఎవరిని బాగా ఆడించవచ్చు మీ చేతుల్తో?"

"మేం స్వారీ చేస్తే ఇరువురి రీతి మారిపోతుంది".

"పురుషుల్ని గతి భ్రష్టుల్ని చేస్తే మీకేం ఒరుగుతుంది?"

"ఇలా నన్ను మధ్యలో మీ ప్రశ్నల్తో వేధిస్తే నేను లేచిపోతాను."

"వెళ్లాలని వుంటే నాకేం అభ్యంతరం లేదు. నేనేమీ మిమ్మల్ని బంధించి వుంచలేదు."



# క్లినిక్ స్పెషల్ షాంపూతో మీ తలచుండును తరమవచ్చు. సభికుల్ని ముగ్ధుల్ని చేయవచ్చు.

చుండు బాధ కారణంగా మీరు సభికుల్ని ముగ్ధుల్ని చేయలేక పోతుంటే, మీరు స్పెషలిస్టు షాంపూతో తలస్నానం చెయ్యవలసిన సమయం వచ్చిందన్నమాట. క్లినిక్ స్పెషల్ షాంపూలోని మృదువైననురగ మీ జుట్టును శుభ్రం చేస్తుండగానే, దీనిలోని ఒక ప్రత్యేక పదార్థం మీ చుండును అదుపులోకి తెస్తుంది. ఆ దురద పోగొట్టి, మీ వెంట్రుకల్ని గొప్పగా కనిపించేలా శుభ్రంగా, ఆరోగ్యవంతంగా ఉంచుతుంది.




# క్లినిక్ స్పెషల్ షాంపూ

**చుండులేని శుభ్రమైన, ఆరోగ్యవంతమైన జుట్టుకోసం.**

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన.

HLL-2607

నాడు



నేడు



రేపు




# మిత్ర చతుష్టయం

ఓ క్షణకాలం మిన్నకుండి పోయిందామె. "నా మీద కోపమొచ్చిందా?" అంది అతి వినయంగా, మెల్లగా.

"లేదు. కోపగించడానికి కారణమేముంది?" అన్నాను సిగ్గుపడుతూ.

"అయితే అంత గంభీరంగా వుండిపోయారేం?'

"నాలుగ్గోడల మధ్య కూర్చుంటే తలనొప్పిగా వుంది" అవలీలగా అబద్ధమాడేశాను.

"జ్వరంగానీ రాలేదు గదా! చూడనివ్వండి' అంటూ నా ఫాలం మీద చెయ్యి వేసింది. ఆమె చేతి సవరింపులో స్నేహ స్పర్శ వుంది.

"తల కొంచెం వేడిగా వుంది జ్వరంకాదు. బయట కూర్చుందాం పదండి' అంది లేస్తూ.

మెల్లగా అనుసరించాను. ఎక్కడా జనసంచారం లేదు. ఎక్కువ పొద్దు పోలేదు. పదకొండు గంటలకే అంతా నిద్రపోయినట్టున్నారు. ఇల్‌ఫ్రాంకోబె నిజంగా మత్తు ప్రాంతం . ఇద్దరం ఫేం కుర్చీలో కూర్చుని చుట్టూరా వున్న దృశ్యాన్ని చదసాగాం. భూమ్యాకాశాలు లీనమయినట్టుగా అంతటా నీలిరంగు అలుముకుంది. వున్నట్టుండి చటుక్కున ఆమె "మీ దేశంలో కామినీ కాంచనాల్ని కాదని వనాల్ని ఆశ్రయించే యోగులున్నారట! నిజమేనా?" అంది

"వనాల్నాశ్రయించే మాట నిజమే "

"నిద్రాహారాలు మాని తపస్సు చేస్తారా?"

"అలా అని విన్నాను".

"అలా చెయ్యడంతో శరీర శక్తి సన్నగిలి మనోదార్ఢ్యం పెరుగుతుందా?"

"కావచ్చు."

"కావచ్చునేమిటి? అలౌకిక శక్తి లభిస్తుందట. దానితో మనశ్శరీరాల్లోని మాలిన్యం అంతా పోతుందని విన్నాను".

"అది నాకు తెలియదు. నేను యోగాభ్యాసాలు చెయ్యలేదు "

"చేసే వుంటారనుకున్నాను"

"అలా అని ఎందుకనిపించింది?"

"మీ ముఖం, వాడి చూపులూ చూసి జితేంద్రియులేమో? అనుకున్నాను "

"అదా! నిద్రలేమి వల్ల"

"అంతేనా? లేక ఆహార లేమా? మీ కళ్ళు జాగరణ, హృదయం వుపవాసం చేసినట్టు వున్నాయ్. మిమ్మల్ని బాగా పరిశీలించాలనే జార్జికి వుద్వాసన చెప్పాను".

"ఏం కనిపెట్టారు?"

'మీకేం వినాలని వుందో నాకు తెలుసు."

"అయితే నా మనసులోని మాట తెలుసన్నమాట!"

"నిస్సందేహంగా. మీరు అయస్కాంతం వంటివారని నా నోట వినాలనుకుంటున్నారు '

"ఏం చెప్పాలా?" అని తడుముకుంటూండగానే "టైమెంతయింది?" అంది.

"పన్నెండు'

"అంత పొద్దు పోయిందా? మనుషుల్నింతగా వాగిస్తారు మీరు? వెళ్తాను. పడుకుంటాను. తెల్లవారే లేచి చాల దూరం వెళ్ళాలి"

"ఎక్కడకు వెళ్ళాలి?"

"వేటకు. మీ ముందే జార్జితో అన్నానుగా!"

"అయితే ఆ వాగ్దానం నిలబెట్టుకుంటారన్న మాట!"

"నిలబెట్టుకోనని మీకు సందేహమెందుకు కలిగింది?"

"మీరు అతనికి చెప్పిన జవాబుని బట్టి"

"అదా! జార్జిని రాత్రంతా మేల్కొని వుంచడానికి!"

"స్నేహితుల పట్ల మీకెంత గౌరవం!"

"నిస్సందేహంగా. జార్జిలాంటి వాళ్లను కాస్త ఎగదోయందే వుస్సురని ఆరిపోతారు సరేపదండి వెళదాం".

ఇద్దరం మళ్ళీ గదిలోనికి వచ్చాం.

"మీ కార్డు ఒకటిస్తారా?" అడిగిందామె.

కోటు జేబు నుండి కార్డొకటి తీసి యిచ్చాను. దాన్ని చదివి "మిమ్మల్ని 'సు' అని పిలుస్తాను" అంది

"మిమ్మల్నేమని పిలవను?"

"మీ ఇష్టమొచ్చినట్టు. అయితే మిమ్మల్ని రోజా గండం నుండి రక్షించాను కాబట్టి 'రక్షకుడు" అని పిలవండి "

"మా దేశంలో ఆపదలో నున్న వాళ్లను కాపాడిన వాళ్లను దేవుడనం. దేవతంటాం. 'తారిణి' అని కూడా అంటాం"

"ఓహ్! ఎంత అందమయిన పేరు! 'తా' మాని 'రిణి' అని పిలవండి."

పిచ్చాపాటీ మాటాడుతోండగా హఠాత్తుగా నా చెయ్యి లాగుతూ "ఏది? మీ చేతికేమయ్యింది? ఓసారి చూడనివ్వండి" అంది.

చెయ్యి వంక చూసుకున్నాను. సింధూరం అద్దినట్టు గా ఎర్రగా తళతళ మెరిసిపోతోంది. నా కుడి చేతిని లాగి ఆమె తన ఎడమ చేతిపై పెట్టి "ఏ గుండె రక్తంలో దిన్ని తడిపారు? వీనస్ డి మిలో వక్షంలో మాత్రం కాదనుకుంటాను".

'కాదు. నీ వక్షంలో నే!"

"ఇంతసేపటికి ఓ సత్యం చెప్పారు ఈ వర్ణం శాశ్వతమని ఆశిస్తాను. మీ చేతికీ వర్ణం పోయిననాడు మన స్నేహమూ మిగలదు. వెళ్ళండి పడుకోండి బాగా నిద్రపొండి కలల్లో నన్ను చూడండి" అంటూ రెండడుగులు వేసి అంతర్థానమయింది.

బెడ్‌రూంలోని అద్దంలో నాప్రతిబింబం చూసి ఆశ్చర్యపోయాను. పూర్తిగా షాంపైన్ సీసా సేవించినంత ఎర్రగా వుంది నా ముఖం. చెక్కిళ్ళు ఎర్రబారినాయి కళ్ళు రత్నాల్లా మెరుస్తున్నాయి నా ముఖం నాకే ఎంతో అందంగా కన్పించింది. ఆమెను మాత్రం స్వప్నంలో చూడలేకపోయాను. నాకసలు నిద్రపడితేనా!

(ఇంకా ఉంది)

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## 1986 దీపావళి కథల పోటీ

## మొత్తం బహుమతులు రు. 7,200/-

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీని నిర్వహిస్తున్నాము. గత ఏడాదికంటే ఈసారి బహుమతుల మొత్తాన్ని పెంచాము. గతంలో లాగే ఇప్పుడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాది క్రమంలో ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో ప్రచురిస్తాము. అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

**ముగింపు తేదీ : 16 ఆగస్టు 1986**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్క దానికి రు. 700/- చొప్పున బహుమతి లభిస్తుంది. ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 750, రు. 650/- రు. 550/- వంతున అదనపు బహుమతులుగా అందజేస్తాము. మిగిలిన మూడు కథలకీ ఒక్కొక్క దానికీ అదనంగా రు. 350/- చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము.

## నిబంధనలు

1. కథా వస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి
2. కథ వ్రాత ప్రతి పన్నెండు అర తావు (ఎక్సర్ సైజుపుస్తకం పేజీక రెట్టింపు) పేజీలకి మించి ఉండకూడదు. కాగితానికి ఒక వైపె సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి. వ్రాతప్రతిపై "1986 దీపావళి కథల పోటీకి" అని మొదటి పేజీ పై భాగంలో స్పష్టంగా రాయాలి
3 అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు. గతంలో ప్రచురింపబడిన రేడియోలో ప్రసారం అయిన, ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన వాటిని పోటీకి పంపరాదు. ఈమేరకి రచయిత(త్రు)లు హామీ పత్రం రాసి సంతకం చేసి వ్రాత ప్రతితో పాటు పంపాలి. హామీ పత్రం లేని రచనలు పరిశీలింపబడవు. ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు.
4. రచయితలు, రచయిత్రులు కలం పేరుతో రాసినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాల్సి ఉంటుంది.
5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము. తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫొటోలతో సహా ప్రచురిస్తాము.
6. పోటీలో బహుమతి పొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫొటో, జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది.
7. రచనలపై వచ్చే ఎలాంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది.
8 పోటీకి పంపే కథలు 16 ఆగస్టు 1986కి గానీ, ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరేలా పంపాలి. ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు.
9. పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తపాలా బిళ్లలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లు జతపరచి పంపనవసరం లేదు.
10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించటం జరుగుతుంది. ఆ విషయాన్ని ఆయా రచయిత(త్రు)లకి తెలియ చేస్తాము. ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత(త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యం కాదు. వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకి ఆవకాశం లేదు.
11. పోటీకి పంపే కథలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పై భాగంలో "1986 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి.

రచయిత(త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

–సంపాదకుడు

## విజయ బాపినీడు రూపొందించిన "పోలీస్ ఆఫీసర్"

"నిజాయితీగల పోలీసు అధికారిగా భానుచందర్, పల్లెటూరి పిల్లగా సుహాసిని, పత్రిక రిపోర్టర్‌గా కల్పన, ద్విపాత్రలలో కన్నడ ప్రభాకర్ నటించారు," అన్నారు విజయ బాపినీడు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కుడికొండ శ్రీనివాసరావు, పాలడుగుల గోపాల కృష్ణయ్య నిర్మించిన పై చిత్రంలో నూతన్ ప్రసాద్, రాళ్ళపల్లి, కాంతారావు, జె. పి. మురుగేశన్, ప్రసాద్, కల్యాణ్, అనూరాధ, వసుంధర తతిమా నటవర్గం. కాశీ విశ్వనాథ్ మాటలు, ఎం. బాబూరావు రచనా సహకారం, వాసూరావు సంగీతం, మహీధర్

"పోలీసు ఆఫీసర్"లో కల్పన



"తాండ్రపాపార యుడు"



# సినిమా

ఛాయ, విటప్ సంగ్ శిల్పం, మోహన్‌దాస్ సంయుక్త దర్శకత్వం, వరప్రసాద్ సహకార దర్శకత్వం, ఫణిబాబు – నరేష్ సహాయ దర్శకత్వం, సాయి – వెంకటేశ్వరరావు ప్రొడక్షన్, వెళ్ళస్వామి కూర్పు, గుత్తా మధుసూదనరావు నిర్వహణతో కోటపాటి ముని సుబ్బారాయుడు సమర్పించే ఈ చిత్రానికి వాసిరెడ్డి ఉమా మహేశ్వరరావు సహ నిర్మాత.

## కోదండరామిరెడ్డి, బాలకృష్ణ కాంబినేషన్‌లో రావు గోపాలరావు సమర్పించే చిత్రం

"ఈ చిత్రంలో సరికొత్త బాలకృష్ణ కనిపిస్తారు," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. జయరామారావు నిర్మిస్తున్న జె. బి. ఆర్. క్రియేషన్స్ చిత్రంలో నందమూరి బాలకృష్ణ సరసన భానుప్రియ నాయిక. రావు గోపాలరావు, రంగనాథ్, గుమ్మడి, గొల్లపూడి, నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు, చరణ్‌రాజ్, రాళ్ళపల్లి, వేలు, చలపతిరావు, పరుచూరి గోపాలకృష్ణ, అన్నపూర్ణ, శ్రీలక్ష్మి ఆదిగాగల వారు పాల్గొంటున్నారు. కథా



...లో కృష్ణంరాజు

## ...శేషాలు

-జి. వి. జి.

సంవిధానం. సంభాషణలకు పరుచూరి సోదరులు కర్తలు. చక్రవర్తి సంగీతం. నందమూరి మోహనకృష్ణ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం. జి. సత్యం – సుబ్రహ్మణ్యం ప్రొడక్షన్, వై. ఆనంద్ సహకార దర్శకత్వం, కె. సదాశివరావు సంయుక్త దర్శకత్వంతో రావుగోపాలరావు ఎం. పి. సమర్పిస్తారీ చిత్రాన్ని.

### బాలకృష్ణతో రాఘవేంద్రరావు సహోదరుల "అపూర్వ సహోదరులు"

"మాట్లాడితే వరాలిచ్చే కలవారి బిడ్డ అరుణ్‌కుమార్‌గా, పేదల పాలిటి దేవుడైన ఆటో డ్రయివర్ రాముగా రెండు పవర్‌ఫుల్ పాత్రలను బాలకృష్ణ సూపర్బ్‌గా పోషించారు. మే 16 నుంచి జూన్ 15 వరకు మైసూరు, ముదుమలై, ఊటీలలో 500 మంది యూనిట్‌తో జరిపిన షూటింగ్‌ల రషెస్ చూసుకుంటే ఫలితం· మేం ఆశించిన దానికంటే ఎంతో ఫెంటాస్టిక్‌గా వచ్చింది. ఖర్చు కూడా మేం అనుకున్నదానికన్నా చాలా ఎక్కువే అయింది. జూలైలో పాచ్ వర్క్ ఫినిష్ చేస్తాం" అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. కృష్ణమోహనరావు నిర్మించిన ఆర్. కె. అసోసియేట్స్ వారిపై భారీ చిత్రంలో విజయశాంతి నాయిక. రావు గోపాలరావు, రంగనాథ్, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, రాళ్ళపల్లి, వేలు, చలపతిరావు, రాజేష్, కాంతారావు, కె. కె. శర్మ, శ్రీరాజ్, చిట్టిబాబు, అన్నపూర్ణ, శుభ, జానకి, మహాజా ఇతర నట వర్గం. సునీల్ వర్మ కథ, సత్యానంద్ సంభాషణలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం. కె. ఎస్. ప్రకాష్ ఛాయ, సలీమ్ నృత్యాలు నిర్వహించారు.

"అపూర్వ సహోదరులు"లో విజయశాంతి



"చంటబ్బాయి"లో చిరంజీవి, సుహాసిని

# సినిమా

## చివరి ఘట్టంలో "చాణక్య శపథం"

"జూన్ 21 నుంచి 30 వరకు మూడవ షెడ్యూల్ పూర్తయింది. చివరి షెడ్యూల్ జులై 21 నుంచి నెలాఖరువరకు," అన్నారు డి. వి. ఎస్. రాజు. ఈయన భారీ ఎత్తున నిర్మిస్తున్న డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో చిరంజీవి, విజయశాంతి, రావు గోపాలరావు, సత్యనారాయణ, ఈశ్వరరావు, అల్లు రామలింగయ్య, చిట్టిబాబు, మాడా, రాజ్యలక్ష్మి, వై. విజయ, అన్నపూర్ణ వగైరా తారాగణం. పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, విజయన్ సాహసాలు, సలీమ్ నృత్యాలు, ఆనందకుమార్ సంయుక్త దర్శకత్వం, గోపాలకృష్ణ – రామారావు ప్రొడక్షన్, కొటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో డి. బి. వి. రాజు, డి. వి. కె. రాజు సహ నిర్మాతలు. దర్శకత్వం: కె. రాఘవేంద్రరావు.

"మారుతి"లో సుమన్, రజని



## రాఘవేంద్రరావు, వెంకటేశ్ కాంబినేషన్‌లో "కలియుగ పాండవులు"

"స్వరాజ్యం రాక ముందు మనల్ని ఇతరులు దోచుకున్నారు. వచ్చాక మనల్ని మనమే దోచుకుంటున్నాం. ఈ దోపిడీపై కలియుగ పాండవుల ప్రతిఘటన ప్రధానాంశం. సంపన్నుల కుటుంబంలో పుట్టి, దర్జాగా జీవిస్తున్న విజయ్ ఒక సంఘటనతో సమాజానికి ఏదైనా చేయాలనే కర్తవ్యాన్ని గుర్తిస్తాడు. భారత దేశపు స్త్రీ స్వరూపానికి ప్రతిబింబం భారతి. విజయ్‌గా వెంకటేశ్, భారతిగా ఖుష్బూ ఎక్స్‌ట్రార్డినరిగా నటించారు. వీరితో పాటు తరుణ్, చిట్టిబాబు, సూర్యకుమార్ కలిసి "కలియుగ పాండవులు". కౌరవులలాంటి దుష్ట పాత్రలలో నూతన్ ప్రసాద్, చలపతిరావు, రాజీవ్, నర్రా వెంకటేశ్వరరావు, వై. విజయ కనిపిస్తారు. రావు గోపాలరావు, రాధా రవి, జయంతి, అశ్విని ఇతర పాత్రధారులు. హిందీ నటుడు శక్తికపూర్ బందిపోటుగా నటించిన కొన్ని సన్నివేశాలను వండలూరు వద్ద మూడు హెలికాప్టర్లతో చాలా థ్రిల్లింగ్‌గా తీశారు 'ఘూ డైరెక్టరు" అన్నారు డి. రామా నాయుడు. ఈయన నిర్మించిన సురేష్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రానికి తెర వెనుక పరుచూరి సోదరులు, వేటూరి, చక్రవర్తి, కె. ఎస్. ప్రకాశ్, విజయన్, మార్తాండ్, కె. రాఘవేంద్రరావు కృషి చేశారు.



మా ఇద్దరి అభిమాన నటుడు ఒకళ్లే! అట్లామా అభిరుచులు కలవటం వల్ల పెళ్లి చేసుకున్నాం నానా!

## కృష్ణతో మల్లికార్జునరావు దర్శకత్వంలో "తండ్రీ కొడుకుల ఛాలెంజ్"

"చిన్న కొడుకు కృష్ణ డిఫెన్స్ లాయర్. పెద్ద కొడుకు రంగనాథ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్. తండ్రి సత్యనారాయణ పోలీస్ ఆఫీసర్. ఈ విద్యాధికులలో బంధం కంటే నీతి గొప్పదని సందేశ మిచ్చే చిత్రం" అన్నారు ఎం. మల్లికార్జునరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎం. వి. రామారావు, ఎ. రామదాస్ నిర్మించే విజయ పద్మాలయా పిక్చర్స్ వారి పై చిత్రంలో రాధ, సుమలత, గొల్లపూడి మారుతీరావు, దీప, చిలక రాధ వగైరా నట వర్గం. పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, పి. ఎస్. ప్రకాశ్ ఛాయ, తోట తరణి శిల్పం, సలీమ్ నృత్యాలు, రాయప్రోలు గోపి-యు. మల్లిబాబు సహకార దర్శకత్వంతో ఎం. కృష్ణారావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. నాలుగు షెడ్యూల్స్‌తో సెప్టెంబర్‌కి షూటింగ్ పూర్తవుతుంది.

## శ్రీ సారథీ స్టూడియోస్ "జైలు పక్షి"

"ఆమెకు జైలుకు వెళ్ళి రావడమంటే పుట్టింటికి వెళ్ళి వచ్చినట్లు. పదే పదే జైలుకి వెళ్ళి వచ్చే పక్షిగా రాధిక అతి క్లిష్టమైన పాత్రను పోషిస్తోంది. కృష్ణారావు అనే కొత్త విలన్‌ను పరిచయం చేస్తున్నాం. జులై 9 నుంచి ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు పి. శశిభూషణ్. ఈయన కోడి రామకృష్ణ దర్శకత్వంలో నిర్మిస్తున్న పై చిత్రంలో డాక్టర్ రాజశేఖర్, బేబీ శాలిని, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, వేలు తదితర పాత్రధారులు. కలైమణి కథ, పరుచూరి సోదరుల సంభాషణలు. కె. వి. మహదేవన్ సంగీతం, గౌతంరాజు కూర్పు, ఎస్. గోపాలరెడ్డి ఛాయ తెర వెనుక హంగులు. ఇదే చిత్రం తమిళ, కన్నడ, హిందీ భాషల్లో కూడా తయారవుతూండడం గమనార్హం.



ఆంధ్ర సారస్వత సమితి బందరులో నిర్వహించిన 20వ వార్షికోత్సవ సభలో బెజవాడ గోపాలరెడ్డి "కవితా సౌరభాలు" అన్న గ్రంథావిష్కరణ - శ్రీ పుచ్చా పూర్ణానందం ఆవిష్కరించినప్పటి చిత్రం. సభాధ్యక్షులు శ్రీ పురాణం సుబ్రమణ్యశర్మ, సమితి అధ్యక్షులు శ్రీ బోయిన వెంకటేశ్వరరావు, శ్రీ కె. వి. భాస్కరరావు (కూర్చున్నవారు) లను చిత్రంలో చూడవచ్చు.



లక్ష్మీకాంత్ B.A. సమర్పించు
మయూరి సుధ
నటించిన సంచలన చిత్రం
నీలిమ ఫిలింస్
దేవీ పూజ
నిర్మాత V. వెంకటరావు M.A.
కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: P.R. సోమసుందర్

## చలనచిత్ర రంగంలో "ఎ" టు "జడ్" ఏ పథకమైనా భారీగా తలపెట్టే సంచలనకారుడు

# టి. సుబ్బరామిరెడ్డి

"శోధించకుండా ఏ రంగంలో ప్రవేశించను. ప్రవేశించాక ఏదీ సాధించకుండా వదలిపెట్టను," అన్నారు రోమన్, స్పానిష్ శిల్ప నైపుణ్యంతో అత్యాధునికంగా రూపొందించబడిన "మహేశ్వరి పరమేశ్వరి" థియేటర్లను చూపిస్తూ ప్రముఖ పారిశ్రామికవేత్త తిక్కవరపు సుబ్బరామిరెడ్డి.

ఇంతలో ఉన్నట్టుండి మెరుపులు ఉరుములతో కుంభపోతగా వర్షం కురవసాగింది. ఆ వర్షంలో తడుస్తూ రోడ్డు మీద వెళ్తున్న ఓ మధ్య వయస్కుడు గేటు తెరుచుకుని, కాంపౌండ్‌లోకి రాబోయాడు. వెంటనే అక్కడున్న వాచ్‌మన్ "ఇప్పుడు టిక్కెట్లు అమ్మరు. ఇంకాస్సేపట్లోనే ఇంటర్వెల్ ... వెళ్ళి తర్వాత రండి." అని చెప్పి, ఆ వ్యక్తిని బయటకు పంపించి, గేటు వేసేశాడు "ఓ సాబ్‌కో అందర్ ఛోడో!" అని సుబ్బరామిరెడ్డి చెప్పేలోగానే.

రెడ్డి నవ్వుతూ నా వంక తిరిగారు. "చూశారా! వచ్చే జన్మలో నేను ఆ వర్షంలో తడుస్తూ వచ్చిన వ్యక్తిగా పుట్టవచ్చు. ఇలాగే గేటు తెరుచుకుని వర్షంలో లోపలికి రాబోతే ఏ వాచ్‌మనో అడ్డుపెట్టొచ్చు. పూర్వజన్మ సుకృతం వల్ల ఇప్పుడు ఈ థియేటర్ల అధినేతగా ఉన్నాను. అందుకే ప్రజోపయోగకరమైన పనులు చేస్తే, ఈ జన్మ సార్థకమవుతుంది. ఎంత గడించాననేది కాదు ముఖ్యం. గడించినదానిని మానవకళ్యాణానికి ఎంతగా వెచ్చించాననేది ముఖ్యం," అన్నారు.

దటీస్ టి. సుబ్బరామిరెడ్డి.

కృపాకరుని, కృషిని నమ్మిన కర్మయోగి.



నిగర్వి. నిండు కుండ.

అది సినిమా శతదినోత్సవం కాని, మరే సాంస్కృతిక కార్యక్రమమైనా కాని - ముఖ్య అతిథిగా ఎవరిని ఆహ్వానిద్దామని తలపోసేవారికి ముందుగా స్ఫురించేది సుబ్బరామిరెడ్డి.

స్వయంకృషితో ఉన్నత శిఖరాలను అధిరోహించిన ఈయన పలు సాంస్కృతిక సంఘాలకు గౌరవాధ్యక్షుడు. వితరణ తెలిసిన కళాబంధువు. విజ్ఞులు మెచ్చిన జ్ఞానసింధువు. 'కళాబంధువు, శ్రీకృష్ణదేవరాయ' వగైరా అవార్డుల గ్రహీత. ఆంధ్ర, బెంగాల్, ఒరిస్సా రాష్ట్రాలలో సుప్రసిద్ధ కాంట్రాక్టరు. అరవై కోట్ల మూలధనంతో ప్రారంభించబడిన ప్రియదర్శిని సిమెంట్ ఫ్యాక్టరీకి ఛైర్మన్. ఇంకా ఎన్నో చోట్ల కమర్షియల్ కాంప్లెక్స్ నెలకొల్పబోతున్నారు.

చలనచిత్ర నిర్మాణంలో తొలి ఘట్టం కథా విభాగం. చివరి ఘట్టం ప్రదర్శనారంగం. ఈ రెండిటితో సంబంధమున్న వ్యక్తి ఆయన.

దాదాపు పదిహేనేళ్ళుగా చలనచిత్ర రంగంలో పరోక్షంగా సంబంధమున్న ఈయన 1981 నుంచి ఎగ్జిబిటర్‌గా, 1984 నుంచి ఫిలిమ్ ఫైనాన్షియర్‌గా, సెంట్రల్ సెన్సార్ బోర్డ్ సభ్యుడుగా, 1985 నుంచి చిత్ర నిర్మాణ రంగంలోనూ ప్రవేశించారు. ఈయన, సురేష్ డి. రామానాయుడుతో కలిసి నిర్మించిన 'కథానాయకుడు' హిందీ వెర్షన్ "దిల్‌వాలా" ఉత్తరాదిలో సూపర్ హిట్ అయింది. పి. శశిభూషణ్ నిర్మాతగా, "జీవన పోరాటం" చిత్రాన్ని అత్యంత భారీగా సమర్పించి, తన ఉత్తమాభిరుచిని నిరూపించారు. మిథున్‌చక్రవర్తితో కలిసి, "పరమేశ్వరి" ఫిలిమ్ డిస్ట్రిబ్యూషన్ స్థాపించి, పంపిణీ రంగంలోనూ ప్రవేశించారు.

ప్రేక్షకులకు అత్యుత్తమైన చిత్రాలను అందించాలనే ధ్యేయంతో స్టోరీ డిపార్ట్‌మెంట్‌ను కూడా ప్రారంభించారు.

అగ్రశ్రేణి హీరోలతో పలు చక్కని చిత్రాలకు సన్నాహాలు చేస్తున్నారు.

ముందుగా భారీ తారాగణంతో "నసీబ్" హిట్ హిందీ చిత్రాన్ని పి. శశిభూషణ్ నిర్మాతగా సమర్పించనున్నారు.

(జి.వి.జి.)

"పగసాధిస్తా"లో జయసుధ



"సత్యాగ్రహం"లో సరిత





"మాయింటి మహాలక్ష్మి"లో మోహన్‌బాబు, రాధ



"కారు దిద్దిన కాపురం"లో నగేష్, మమత

## కె. ఎస్.ఆర్. దాస్ చిత్రం "కౌబాయ్ నెం-1"

"జూన్ 28 నుంచి జూలై 15 వరకు నేరభైలు, తలకోన ప్రాంతాలలో కొన్ని లక్షలు ఖర్చు చేసి నిర్మించిన మెక్సికన్ స్ట్రీట్‌లో కొన్ని ప్రధాన సన్నివేశాలను చిత్రీకరించాం" అన్నారు ఆక్షన్ చిత్రాలను రూపొందించడంలో తనకు తానే సాటి అనిపించుకున్న కె. ఎస్. ఆర్. దాస్. ఈయన సమర్పణ, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో కె. సుకుమార్ హాలీవుడ్ ఖ్లిప్‌లో నిర్మిస్తున్న సుకుమార్ ఆర్ట్ పిక్చర్స్ వారి పై సినిమా స్కోప్ చిత్రంలో అర్జున్, రజని, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, కోట శ్రీనివాసరావు, భీమరాజు, విక్రమ్, జయమాలిని, బబిత పాల్గొంటున్నారు. వి. ప్రకాష్ మాటలు, జాలాది పాటలు, చక్రవర్తి సంగీతం. లక్ష్మణ్ ఛాయ, కృష్ణ శిల్పం, ప్రకాష్-సురేఖ నృత్యాలు, రంగారావు సంయుక్త దరకత్వం, ఆది ప్రొడక్షన్, హార్స్‌మన్‌బాబు సాహసాలు తెర వెనుక హంగులు.

## షూటింగ్ పూర్తయిన "కెప్టెన్ నాగార్జున్"

"జూన్ 15 నుంచి జూలై 5 వరకు మద్రాసులో ఆఖరి షెడ్యూల్‌ను పూర్తి చేశాం" అన్నారు జగపతి ఆర్ట్ పిక్చర్స్ అధినేత వి. బి. రాజేంద్ర ప్రసాద్. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించిన పై చిత్రంలో నాగార్జున, ఖుష్బూ, గొల్లపూడి మారుతీరావు, నూతన్ ప్రసాద్, శుభలేఖ సుధాకర్, రాజేంద్ర ప్రసాద్ నటించారు. ఆత్రేయ మాటలు, పాటలు రాశారు. చక్రవర్తి సంగీతం. నవకాంత్ ఛాయ, సురేష్ సంయుక్త దర్శకత్వం, శంకర్ శిల్పం, అక్కినేని సంజీవి కూర్పు తెర వెనుక హంగులు.

"రాక్షసుడు"లో సుమలత



## విజయ బాపినీడు దర్శకత్వంలో శోభన్‌బాబు, సుహాసిని

"సెప్టెంబర్‌లో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు విజయ బాపినీడు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎం. నరసింహారావు నిర్మించే రాశీ మూవీ క్రియేషన్స్ వారి చిత్రం జూలై 1 న సెట్స్‌కు వెళ్ళింది. శోభన్‌బాబు, జగ్గయ్య, నూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, రాళ్ళపల్లి, వై. విజయ ఆదిగా గలవారు పాల్గొంటున్నారు. ఆగస్ట్, సెప్టెంబర్ వరకు ప్రతినెలా 1-10 తేదీలమధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది. చక్రవర్తి సంగీతం, మహీధర్ ఛాయ, కళాధర్ శిల్పం, వై. ప్రకాష్-బత్తుల నాగేశ్వరరావు ప్రొడక్షన్, బాబూరావు సహకార దర్శకత్వం, మోహన్‌దాస్ సంయుక్త దర్శకత్వం నిర్వహిస్తున్నారు. □

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన అందాల తార సుహాసిని. అనతికాలంలోనే జాతీయ ఉత్తమనటి అవార్డును అందుకున్నారు. ఆమె ప్రతి చిత్రంలోనూ నటిస్తారు అనే కంటే ఆయా పాత్రలలో జీవిస్తారు అని చెప్పవచ్చు. చిలిపి నటన చేయాలన్నా, కఠిన స్వభావము గల పాత్రలలో నటించాలన్నా ఆమెకుఆమే సాటి. స్త్రీల హక్కుల కోసం పోరాడే స్వాతిగా, ఆడదానికి కావలసిన చొరవను చూపే



లేడీడాక్టరుగా, సాటి స్త్రీ సంతోషం కోసం తన ప్రేమనే త్యాగం చేసిన త్యాగమూర్తి సింధు భైరవిగా, కష్టాలలో కూడా నవ్వుతూ ఉండాలనే స్రవంతిగా బాగా నటించారు. ఇకముందు కూడా చిత్రాలను అంగీకరించేటప్పుడు పాత్రల విషయంలో శ్రద్ధ తీసుకొని మంచి చిత్రాలలో నటించి చలన చిత్రరంగంలో సుహాసినికి సాటి ఎవరూ లేరని పేరు తెచ్చుకోవాలి. సుహాసినిని విప్లవ వీర నారీమణిగా, లెక్చరర్, లాయర్ పాత్రలలో చూడాలని ఉంది.

–పి. రత్నకుమారి, భీమవరం

★ ★ ★

'సితార' చిత్రం ద్వారా తెలుగు తెరకు పరిచయమైన భానుప్రియ అనతికాలంలోనే అగ్రనటిగా తారాపథంలో నిలదొక్కుకుంది. తన అందచందాలతో నటనా వైదుష్యంతో ఎందరో ప్రేక్షకుల హృదయాలను ఆకట్టుకున్నది.

ఆమె తన హావభావాలను మాటలతో కాకుండా చూపులతోనే ప్రదర్శించ గల దిట్ట. ఆధునిక వేషధారణలో ఆమె చాలా ఆకర్షణీయంగా



ఉంటుంది. ఎటువంటి పాత్రనైనా అవలీలగా పోషించి, అన్ని తరహా పాత్రలలోను జీవించగల నైపుణ్యం ఆమెలో ఉంది. కాబట్టి ఆమె పలు భాషా చిత్రాలలో నటించి 'జాతీయనటి'గా పేరు పొందాలని ఆమె అభిమానిగా నేను ఆకాంక్షిస్తున్నాను.

–జి. హరిప్రసాదరాజు,
శ్రీనివాసనగర్, బోధన్

నా అభిమాన తార కమలహాసన్. కమలహాసన్‌లా నటనతో, అందానితో, గ్లామర్‌తో పైకి వచ్చినవారు బహు అరుదు. నటనతో అటు మాస్ వారి, ఇటు క్లాస్ వారి ఆదరాభిమానాలు చూరగొన్న మహానటుడు. నాటి మరో చరిత్ర, నేటి సాగర సంగమం, స్వాతి ముత్యం అతని సినీ జీవితంలో మచ్చుతునకలు. అతడి నటనకు ఎల్లలు లేవు. బహు భాషా నటుడు. అన్ని భాషల చిత్రాల్లోను నటిస్తూనే ఉన్నాడు.

ఇంత ఖ్యాతిని గడించిన కమలహాసన్‌కు నేనిచ్చే సలహా ఏమిటంటే, కథాసంవిధానం లేని, ఏ మాత్రము కళా విలువలు లేని, ఒకే మూసలో వచ్చే చిత్రాల్లో నటించ వద్దని, పుకార్లకు మూలమైన పనులు చేయవద్దని మనవి. మా సలహాలను స్వీకరించి మున్ముందు ఇంకా ఎంతో పేరు



సంపాదించి మమ్మానందింప చేయాలని ఆకాంక్షిస్తున్నాము.

–కాట్ర శారద, లాం, గుంటూరు

★ ★ ★

డేరింగ్, డాషింగ్ అండ్ డైనమిక్ హీరో అయిన



చిరంజీవి అంటే నాకు అంతులేని అభిమానము. ఎటువంటి పాత్రలకైన ఇట్టే జీవము పోయ నేర్పుకు గల కారణం "చిరంజీవి" చలాకీతనం, పట్టుదల. బాధ, కోపము, సంతోష భావాలను చిరంజీవి కళ్ళతోనే అద్భుతంగా వ్యక్తము చేయగలరు. అందుకే నాకు ఆ కళ్ళంటే మరీ ఇష్టము. "చిరంజీవి" నాకు అమితంగా నచ్చిన సినిమా కుటుంబ కథా చిత్రాలు "విజేత", "మగధీరుడు" అతని నటనా జీవితములో మరో మెట్టు. మంచి కథా, యాక్షన్ చిత్రాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వాలని చిరంజీవికి నా సూచన. అనతి కాలములో చిరంజీవి ఏకైక అగ్రనటుడు కావాలని నా ఆశ, ఆకాంక్ష, "అభిలాష."

–యం. యస్. దేవి, ఉరవకొండ

తేనె మనసులు చిత్రం (1965) ద్వారా తెలుగు చిత్రసీమకు పరిచయమై, ఇప్పటి వరకు ఎన్నో విజయాలను చవి చూచి వెండి తెరపై దేదీప్యమానముగా వెలుగుతూ, నాలుగు సంవత్సరములుగా సూపర్‌స్టార్‌గా ఎన్నిక కాబడిన నటుడు "కృష్ణ" గారి అభిమానిని అని చెప్పుకొనుటకు సంతోషించు చున్నాను. కృష్ణ సినిమా రంగములో ప్రవేశించినప్పటి నుండి ఎన్నో



సొంత చిత్రాల నిర్మాణాన్ని చేపట్టి విజయం సాధించారు. ఈ సంవత్సరములో నాలుగు కోట్ల రూపాయలతో "సింహాసనం" చిత్రాన్ని తెలుగు, హిందీ భాషలలో నిర్మించడమే గాక తమిళ, కన్నడ భాషలలో కూడా డబ్బింగ్ చేసిన ఘనత కృష్ణ గారికే దక్కుతుంది. ఈ చిత్రము అపూర్వ విజయము సాధించినందుకు అభిమానిగా నేను ఎంతో గర్విస్తున్నాను. కృష్ణగారు ఇంతటితో ఆగక, ఇంకా ఎన్నో జానపద, పౌరాణిక, చారిత్రాత్మక చిత్రాలను నిర్మించాలని ఆయన అభిమానిగా కోరుకుంటున్నాను. కృష్ణగారు ప్రజాహిత కార్యక్రమాలలో విరివిగా పాల్గొనాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

– పాలాది ఉమామహేష్,
జయనగర్ కాలనీ, కడప

★ ★ ★

ఈ సంవత్సరము "ఉత్తమ నటి" అవార్డునే గాక "సూపర్ హీరోయిన్" స్థానాన్ని సంపాదించిన అందాల తార నా అభిమాన నటి "విజయశాంతి".



తన నట జీవితాన్ని "కిలాడి కృష్ణుడు" చిత్రము ద్వారా ప్రారంభించి ఇప్పటికి ఎన్నో పాత్రలలో నటించి ఎంతో పేరు సంపాదించుకుంది. ముఖ్యముగా "నేటి భారతము", "ప్రతిఘటన" చిత్రాలలో ఆమె నటన మరువలేనిది. ఇక ముందు కూడా ఇలాంటి ఎన్నో పాత్రలలో నటించి నాలాంటి ఎందరో అభిమానుల అభిమానాన్ని సంపాదించుకోవాలని ఆశిస్తున్నాను.

– జె. రవి జనార్దన్ రావు, కరీంనగర్ □

# సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? – చర్చ

## మారుతున్న కాలానికి అవసరమే



నేటి విద్యావంతులయిన యువతీ యువకులు సెక్స్ గురించి సరిఅయిన అవగాహన లేక వారి భావి జీవితాన్ని చేజేతులా నాశనం చేసుకొంటున్నారు. సెక్స్‌విద్యను కళాశాలల్లో తప్పక ప్రవేశ పెట్టాలి. మారుతున్న కాలాన్నిబట్టి విద్యావంతులయిన స్త్రీ పురుషులకు వారి భయాందోళనలను, సిగ్గు బిడియం పోగొట్టి సెక్స్ సంబంధమైన సుఖవ్యాధులు రాకుండా వారి బంగారు భవిష్యత్తును రూపు దిద్దటానికి సెక్స్ ఎడ్యుకేషన్ చాల అవసరం. సెక్స్ పరమయిన కట్టుబాట్లులేని పాశ్చాత్య దేశాలు చాల అభివృద్ధి చెందినాయి. సమాజ శ్రేయస్సు కొసం నేటి యువతీ యువకులకు సెక్స్ ఎడ్యుకేషన్ ప్రవేశపెడితే కుటుంబ నియంత్రణ, లైంగిక పరమైన విషయాలను శాస్త్రీయ దృక్పథంలో ఆలోచించడానికి వీలవుతుంది. ఈనాడు దాంపత్య సుఖంలేని జీవితాలు ఎన్నోవున్నాయి. అలాంటివారి జీవితాలకు బంగారు బాటవేయాలంటే కచ్చితంగా, నిర్బంధంగా కళాశాలల్లో సెక్స్ ఎడ్యుకేషన్ ప్రవేశ పెట్టాలి. వారి బంగారు జీవితాన్ని మూడు పువ్వులు ఆరు కాయలుగా చేసి అపోహలను, భయాందోళనలను, పేరుకు పోయిన పాత ఆచారములు మాపుచేయాలి.

–పయిడిమర్రి వెంకట సుబ్బారావ్,
మార్కాపురం

* * *

## ఉద్రేక పరిచేదిగా ఉండకూడదు



మన పెద్దవాళ్లు 'సెక్స్' అనే విషయాన్ని రహస్యంగా ఉంచడం జరిగింది. ఈ సెక్స్ అనేది మనిషి జీవితంలో ఒక భాగమని, ముఖ్యమని, భార్యాభర్తల్లో అవగాహనకి ఇది ఒక అవకాశమని ఈ నాటి యువతీ యువకుల్లో చాల మందికి ఈ నిజం తెలియదు. ఈనాడు పెళ్ళైన మొదట రాత్రి ఎంతమంది జంకు, భయం లేకుండా సుఖపడుతున్నారు? చాలా మంది లేనిపోని సంపలు తమ పిల్లలపైపెట్టి పెళ్ళిళ్ళు కానే ఉద్దేశ్యంతో రజస్వల కాగానే చదువు మాన్పించేస్తున్నారు. ఒక్కతే కూతురైనపుడు లేక అన్నా వదినల ఇంటనున్న ఆడపిల్లలకు భార్యాభర్తలిద్దరూ ఒకే గదిలో పడుకోవడం ఎదిగే ఆ మనసులపై లేనిపోని భయాన్ని, అసహ్యాన్ని సృష్టిస్తుంది. కాబట్టి కళాశాలల్లో బోధించే అన్ని పాఠ్యాంశాల్లో ఈ సెక్స్ విషయంలో కూడ బోధన అవసరమే. యువతరం నైతికంగా ముందంజ వేయాలన్నా, కామోద్రేకంతో జరిగే మానభంగాల్ని అరికట్టాలన్నా, ఆదర్శ జీవితం గడపాలన్నా, లైంగికపరమైన విషయాల్ని శాస్త్రీయంగా ఆలోచింప జేయడానికి ఈ సెక్స్ ఎడ్యుకేషన్ ఎంతో అవసరం. కాని ఈ సెక్స్ పరిజ్ఞానం యువతీ యువకుల్ని ఉద్రేకపరచి నైతికంగా దిగజారి కట్టుబాట్లను అధిగమించేదిగా ఉండకూడదు.

–బి. సుభ, గాజువాక, విశాఖపట్నం

* * *

## ఎంత మాత్రం తప్పుకాదు



నేటి విద్యా విధానంలో సెక్స్ ఎడ్యుకేషన్‌ను ఒక సబ్జెక్టుగా ప్రవేశ పెట్టవలసిన అవసరం ఎంతైనా ఉంది. సెక్స్ పట్ల సరైన అవగాహన లేక, పెరిగే వయస్సుతో పాటు శరీరావయవ నిర్మాణంలో కలిగే మార్పులకు భీతి చెందటం యవ్వనంలో కలిగే ఉద్రేకాలకు లోనయి అడ్డదారులు తొక్కి, అమూల్యమైన భవిష్యత్తును నాశనం చేసుకోవడం జరుగుతున్నది. 'సెక్స్' పదం వినగానే ఏమిటో పెద్ద తప్పు చెస్తున్నట్లు ఫీలయ్యే అమాయక, తెలివితక్కువ యువతీ యువకులు ఉన్న ఈ రోజుల్లో 'సెక్స్' అంటే ఏమిటి, దానివలన కలిగే పరిణామాలు గురించి తెలియక తీవ్రమైన సమస్యలకు గురిఅయి సుఖప్రదమైన జీవితాన్ని గడపలేక పోతున్నారు. భావిభారత సమాజ సృష్టికర్తలైన నేటి యువతరానికి సెక్సు విజ్ఞానాన్ని అందించడం ఎంతమాత్రం తప్పుకాదు– తల్లి తండ్రులను, స్నేహితులను అడిగి సందేహ నివృత్తి చేసుకోలేని సమస్యలను గురువు ద్వారా విజ్ఞాన పరంగా బోధించడం ఎంతైనా అవసరం–

–వజ్రే నగేష్, బొబ్బిలి

* * *

## అనుకున్న ఫలితాలు రాకపోవచ్చు



జీవితంలో సెక్స్ అనేది ముఖ్యమైనదే కావచ్చు ఇది సహజ పరిణామ క్రియ. ప్రకృతి నేర్పే పాఠం. పక్షికి రెక్కలు రాగానే ఎగురుతుంది. చేపపిల్ల పుట్టగనే ఈదుతుంది. ఇది ప్రకృతి సహజం. ఈనాడు సమాజంలో కొన్ని కోట్ల నిరక్షరాస్య కుటుంబాలెన్నో సుఖ సంతోషాలతో జీవిస్తున్నారు. ఎటొచ్చి చదువుకున్న వారిలోనే, సెక్స్ అంటే కొద్ది గొప్పో తెలిసిన వారిలోనే, భేదాభిప్రాయాలువచ్చి జీవితాలు నరకం చేసుకుంటున్నారు. కళాశాలల్లో సెక్స్ ఎడ్యుకేషన్ ప్రవేశపెట్టడంవల్ల అనుకున్న ఫలితాలు రాక అవకతవకలు జరగవచ్చు. సంపన్న దేశాలు సెక్స్ కారణంగా సంపన్నం కాలేదు. వారు సాంకేతిక రంగాన ప్రముఖులై తద్వారా దేశాభివృద్ధిని గాంచారు. సెక్స్ కేవలం సాంసారిక విభాగం. దానిని దేశ మనుగడకు సంబంధింప జేయటం యుక్తం కాదు. కళాశాలల్లో చదువుకున్నవారే సెక్స్‌ను గురించి తెలుసుకోనగలరు. మరి పల్లెలలోని వారేమిటి? ఎక్కువమంది నిరక్షరాస్యులేగదా. వారికి సెక్స్ గురించి సరైన అవగాహన ఎలా లభిస్తుంది?కావున యువతరం కేవలం సెక్స్ ప్రలోభాలకు లోనుకాక, సాంకేతిక, వృత్తి విద్యలలో ప్రవీణులై తద్వారా దేశాభివృద్ధికి తోడ్పడాలి.

– పల్లె వెంకటేశ్వరరావు, హెచ్.
ముత్యాలంపాడు, మైలవరం ☐

### గమనిక

సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? అనే విషయంపై రాసేవారు తమ రచనలని 500 అక్షరాలకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాసి పంపాలి. పరిశీలనకి పంపే రచనతో పాటు తమ ఫొటో ని కూడా విధిగా పంపాలి. రాసినవారి పూర్తి పేరు, చిరునామా స్పష్టంగా ఇవ్వాలి. ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపగోరేవారు వాటితో పాటు తగినన్ని స్టాంపులు అతికించిన కవరు పంపాలి. రచన, ఫొటో లని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధినగరం, విజయవాడ–520003 అనే చిరునామాకి పంపాలి. వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

–సం.




సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

(గత సంచిక తరువాయి)

నెల రోజుల తేడాలో ముహూర్తాలు పెట్టారు. వ్యవధి తక్కువగా వున్నా పెళ్ళి ఆడంబరంగా జరిగిపోయింది. అప్పటికే సంధ్యకి రెండవ నెల! తన ఫ్రెండ్స్ అందరికి ప్రత్యేకం ఫైవ్‌స్టార్ హోటల్‌లో రిసెప్షన్ ఇచ్చారు.

ఆ తరువాత ఇంట్రస్ట్ లేదని సంధ్య కాలేజీకి గుడ్‌బై చెప్పింది.

పిల్లలు పుడితే ఇప్పట్లో కుదరదని పరీక్షలు కాగానే హనీమూన్ ట్రిప్ వేశాడు ప్రభాకర్. అతన్కి సైట్‌సియింగ్ అంటే ఇష్టం.

"నాకు నీర్సంగా వుంది. నేను రాలేను బాబూ! హాయిగా ఇంట్లో రెస్ట్ తీసుకుంటాను..." అంది.

కాని ప్రభాకర్ వూరుకోలేదు.

"కాదు రావాలి. నా కోసం! నీకు డెలివరి అయ్యాక అస్సలు వెళ్ళలేం ప్లీజ్.. నాకోసం రావూ?"

సంధ్య గెడ్డం పట్టుకుని బ్రతిమాలాడు.

తియ్యగా నవ్వింది సంధ్య.

అతని భుజాల మీద చేతులువేసి చెప్పింది.

"వస్తాను"

అంతే.

పరీక్షలు కాగానే బ్యూటిఫుల్‌వేలీ "కాశ్మీర్" వెళ్ళారు.

సంధ్యకి అలసటగా వుండకూడదని ఫ్లైన్ టికెట్స్ బుక్ చేశాడు.

రిటన్ జర్నిలో ఢిల్లీ, ఆగ్రా, ఫతేపూర్ సిక్రి... అన్నీ చూశారు.

గులాబి తోటలు... వెన్నెలలో తాజమల్ అందాలు... అద్భుతమైన ఆ కట్టడంలో ముంతాజ్ సమాధి... పాదరక్షలు విడిచి నిశ్శబ్దంగా లోపలికి వెళ్ళి... ఆ ప్రేమ మందిరంలో దీర్ఘ నిద్రలో వున్న షాజహాన్ ప్రియురాలి సమాధి సందర్శన... ఒక గొప్ప థ్రిల్లింగ్!

యమునా నది గలగలలు... పోష్ హోటల్స్‌లో జల్సాలు.

ఇక కాశ్మీర్ అందాల గురించి వేరే చెప్పనక్కరలేదు.

దాదాపు నెల రోజులదాకా కాశ్మీర్‌లో గడిపారు.

ఎంత సుందరమైన వేలీ!

ఎత్తయిన కొండలు..... అగాధమైన లోయలు...

ఆకాశగంగ దిగివచ్చిందా అన్నట్లు... అంతు తెలియని లోతుతో మంచు కరిగినట్లు చల్లగా ప్రవహించే "జీలంనది!"

జీవం తొణికిసలుతూ పచ్చటి ఎత్తయిన యూకలిప్టస్ చెట్లు (నీలగిరి చెట్లు)

కన్నులు చెదిరే రంగుల పూలవనాలు... అటు ఇటు అగాధమైన లోయల మధ్యనుంచి ఎత్తయిన కొండల మీదుగా సన్నని బాట వెంటపోతాయి బస్సులు, టాక్సీలు, లారీలు... అలా తిరుగుతూనే వుంటాయి.

డ్రైవర్ ఏ మాత్రం ఏమరుపాటుగ వున్నా అంత ఎత్తు నుంచి అగాధమైన లోయలో పడి నామరూపాలు లేకుండా నశించి పోక తప్పదు.

పైగా అది స్ప్రింగ్ సీజన్!

బాట మరి ప్రమాదకరంగా వుంటుంది.

"హెవెన్ ఈజ్ నియర్..." అని హెచ్చరికగా వందగజాల కొకసారి ఎర్రటి అక్షరాలతో బోర్డు కనిపిస్తూ వుంటుంది.

ఆకాశాన్నంటేలా వున్న యూకలిప్టస్ వృక్షాలు "టాలెస్ట్ ఫారెస్ట్ ఇన్ ద వరల్డ్" అని చాటి చెపుతున్నాయా? అనిపిస్తాయి.

ఇక అక్కడి కాశ్మీర్ కన్యల అందాల గురించి చెప్పక్కర్లేదు.

ఆడవాళ్ళకే అసూయ అనిపించేలా వుంటారు!

ఇంక మగవాడన్నవాడు మూర్ఛ పడాల్సిందే! అంత చక్కగా వుంటారు అమ్మాయిలు.

తెల్లగా.... పాలరాతి బొమ్మల్లా అందమైన కాశ్మీర్ కన్నె పడుచులు.

తలకి పెద్ద సైజు రుమాళ్ళు లాంటి గుడ్డలు చుట్టుకుని తలపైన తట్టలు పెద్దపెద్ద కూరగాయల బుట్టలు మోస్తూ కూలిపన్లు చేసుకునే స్త్రీలు కూడా అప్సరసలని దిద్దిన అందంతో - అక్కడవున్న అందమైన పూలతోటల్లాగే - కన్నులవిందు చేస్తారు.

ఇక-

టాక్సీలో "నెహ్రూ టనెల్"లో ప్రయాణిస్తుంటే అదో గొప్ప ఎగ్జయిట్‌మెంట్! మాటల కందని థ్రిల్!

సంధ్య అయితే మరి చిన్న పిల్లలా సంబరపడి పోయింది.

"ఏయ్ ప్రభూ! మనం ఇద్దరం ఎన్నో చూశాంగాని.... ఇలాంటి "టనెల్" నేనెప్పుడూ చూడలేదు" అంది.

"అవును" అన్నాడు ఆమెని దగ్గరకి తీసుకుంటూ ప్రభాకర్.

పెద్ద కొండని దొలిచి పొడవైన సొరంగంలా తవ్వి ఆ "టనెల్" మార్గం

**జరిగిన కథ - 16:** సంధ్య స్మృతి చిహ్నంగా మిగిలిన ఎర్ర గులాబీలను సీత కోసిందని ఆ పూలు కోస్తే తను కొయ్యాలి కానీ వేరెవ్వరూ కొయ్యడానికి లేదని కఠినంగా చెప్తాడు ప్రభాకర్. సీత స్తంభీభూతురాలయింది. ప్రభాకర్ కూడా భార్యపట్ల అంత కఠినంగా తాను ప్రవర్తించి ఉండకూడదని బాధపడతాడు. సీత గర్భవతి అయింది. ఆ విషయం కూతురు మంజూ ద్వారా తెలుసుకున్న ప్రభాకర్‌కి పట్టరాని ఆగ్రహం వచ్చింది. సీత తనని తల్లిని కావద్దని శాసించే అధికారం ప్రభాకర్‌కి లేదని, తనకంటూ ఒక బిడ్డ ఉండాలని అంటుంది. ప్రభాకర్ డా. ఆనంద్‌ను కలుసుకోవడానికి వెళతాడు.

సృష్టించారు. ఆ ద్వారంగుండా టాక్సీ పోతుంటే ఒక గుహలోంచి వెళుతున్నట్టు వుంటుంది. బాగా చిమ్మ చీకటిగా వుంటుంది. ఆ సొరంగ మార్గంలో కారు లైటు వెలిగే దారి చూపుతుంది.

కిందంత మోకాలి లోతు నీళ్లు వుంటాయి. పై రాతిగోడల్లోంచి వర్షం జల్లు పడుతున్నట్లు నీళ్లు పడుతూ వుంటాయి.

ఈ నీళ్ళు ఎప్పటికప్పుడు లెట్అవుట్ అవుతూ వున్నా నిత్యం అలా జల వూరుతూ వుంటుంది.

ఆ నీళ్ళల్లోంచి.... ఆ చీకట్లో.... ఆ సొరంగంగుండా.... దాదాపు పావుగంటసేపు ఆ టాక్సీ ప్రయాణిస్తుంది.

ఆ కాస్సేపు అద్భుతంతో గుండె థ్రిల్లింగ్‌గా అవుతుంది.

ఇంజనీర్ల అద్భుతశక్తికి జోహారు చెయ్యాలి అనిపిస్తుంది.

కాశ్మీర్ వేలీ విహారం అంతా ఒక ఎత్తు.

ఆ "నెహ్రూ టనెల్" ప్రయాణం ఒక్కటి ఒక ఎత్తుగ వుంటుంది.

సంధ్య ప్రభాకర్ ఒక లగ్జరి హోటల్‌లో "బస" చేశారు.

టూరిస్ట్ గైడ్స్ వుంటారు.

బస్సులు వుంటాయి. కాని చాలా ఎర్లీమార్నింగ్ స్టార్ట్ అవుతాయి.

అవును......

ఆ రోజు ఏం జరిగింది?

సోనామార్గ్ వెళ్ళటానికి బస్సు టిక్కెట్లు తీసాడు ప్రభాకర్.

ఉదయం ఆరుగంటలకి బస్సు బయలుదేరుతుంది. అంతకు ముందురోజు అర్ధరాత్రిదాకా బజార్లన్నీ తిరుగుతూ షాపింగ్ చేశారు.

అలసటలేకుండా రోడ్లన్నీ సరదాగా తిరిగారు. నచ్చినవన్నీ కొనటం మొదలు పెట్టారు. ఇంకా బాగా వెలుతురు వుందికదా అనుకున్నారు. టైమ్ చూడాలన్న ధ్యాసకూడా మర్చిపోయి సైట్‌సీయింగ్‌లో మునిగిపొయ్యారు.

సూర్యుడు అస్తమించి కనుచీకట్లు పడుతున్నవేళ.... గప్పున లైట్లు వెలిగాయి.

యధాలాపంగా వాచి చూసిన సంధ్య "కెవ్వు" మంది.

సమయం రాత్రి తొమ్మిది గంటలు అయ్యింది!

"బాప్‌రే!" అనుకున్నారు.

వాచీగాని తప్పు తిరగడం లేదుకదా?

ఇప్పుడే కదా సూర్యాస్తమయం అయ్యింది?

ప్రభాకర్ అనుమానం తీరక ఒక షాపులోకి వెళ్ళి టైమ్ అడిగాడు.

"నవ్ బజే" అన్నాడు.

అంటే? ఇక్కడ సూర్యాస్తమయం రాత్రి తొమ్మిది ప్రాంతంలోనా?

ఇద్దరికి భలే తమాషాగా ఆశ్చర్యం అనిపించింది.

కాని ఆ తరువాత తమ తెలివి తక్కువ తనానికి నవ్వుకున్నారు.

"అవును మరి. సూర్యుడు కొండల మధ్య కదా అస్తమించేది. తామిప్పుడు ఎత్తయిన కాశ్మీర్ కొండల మీద వున్నారు. అందుకే సూర్యుడు మిగత జగత్తుని అస్తమించిన తమకి కనిపిస్తూనే వున్నాడు!" అనుకున్నారు. అప్పుడు తెలిశాయి కాళ్ళ నొప్పులు.

ఇంక అక్కడితో షాపింగ్ ముగించి హోటల్లో దొరికింది ఏదో తిని లాడ్జింగ్‌కి వచ్చేశారు.

చలి!

గజగజా ఒణికించేస్తూంది. చలి కొండల మీద తెల్లగా పేరుకొని వుంటుంది.



## జీవితం చేజారిందా

"ఏయ్ ప్రభూ! నా కాళ్ళు పడిపోతున్నాయ్. రేపు ఇంక నేను ఎక్కడికి రాను." అంది సంధ్య రొజాయి కప్పుకొంటూ.

ప్రభాకర్ ఆమెని వెచ్చగా కౌగలించుకొని పెదాల మీద ముద్దుపెట్టు కున్నాడు.

"అలా అంటే ఎలా? రేపు సోనామార్గ్ చూడవా? .... అక్కడంత మంచేట......"

"అమ్మో! నేను వచ్చినా రాను. ఇంత చలిలో అంత ఉదయాన... అంత మంచులో కి...."

నవ్వాడు ప్రభాకర్.

"అయ్యిందా అమ్మాయిగారి పని? మరి మనం మంచుకొండల్లో వున్నాం... చలికాక వేడిగా వుంటుందా? అదిసరేగాని సంధ్యా... కాశ్మీర్ బాగుంది కదూ?"

"ఊ....?"

"ఇక్కడ గులాబిలు... పూలు..... చెట్లు... చాలా బాగున్నాయి కదూ?"

"ఊఁ.....?"

"లోయలు..... నది.... కూడా బాగున్నాయ్‌కదూ?"

"ఊఁ......?"

"అమ్మాయిలు ఇంకా బాగున్నారుకదూ?"

"................."

"నిన్నే.........?"

సంధ్య చప్పున మొఖం తిప్పుకుంది కోపంగా.

నవ్వాడు ప్రభాకర్.

"అతబుద్ధి బయట పడింది."

"ఊ? అక్కడికి మీ మగబుద్ధి బయట పడనట్లు?"

మధురంగానవ్వింది సంధ్య.

ఆమె నవ్వుతో ప్రభాకర్ కూడాశృతి కలిపాడు.

"నిజంగానే ప్రభూ! ఇక్కడి అమ్మాయిలు చాలా అందంగా సహజ సౌందర్యంగా వున్నారు. తెల్లటి రంగు, కొటేరు వేసిన ముక్కులు, జుత్తు కనిపించకుండా తమాషాగా చుట్టుకున్న పెద్ద రుమాల, చాలా బాగున్నారు. గడ్డికోసుకొనే అమ్మాయి గూడా అద్భుత సౌందర్యంతో వుంది" అంది ఆశ్చర్యపోతూ.

"అవును సంధ్యా! ముఖ్యంగా ఇక్కడి వాతావరణ ప్రభావం అదంతా. అన్నట్లు ఆడా - మగా అందరి మొఖాలనిండా..... ఆ తెల్లటి చెక్కిళ్ళమీద ఎర్ర సిరాపెన్నుతో పెట్టినట్లు ఆ చుక్కలు చూశావా? చలికి....." అన్నాడు.

* * * * * * *

## అందం

ఎరుపు
తగు మాత్రంగా వుంటేనే అందం –
వెన్న కడవలాంటి తెల్లని మనసులో
అనురాగ బిందువులాగా!
గంధపు చెక్కలాంటి ప్రియురాలి నుదుట
కుంకుమ బొట్టులాగా!
చిలక ముక్కులాగా,
చిన్నారి నోట తాంబూలం లాగా!

– కలువకొలను సదానంద

"వర్డ్స్‌వర్త్" కాబోలు. "ది రీపర్" అని కవిత్వం రాశాడు.

చాలా అందమైన కవిత్వం. చక్కని భావుకత కనిపిస్తాయి ఆ కవిత్వంలో......

ఒక గడ్డి కోసుకునే అమ్మాయి..... ఎక్కడో లోయల్లో వచ్చి గడ్డి కోస్తూ తియ్యగా పాడుతుంది.

అతను (కవి) పనిమీద ఆ వేలికి వచ్చి ఒకగెస్ట్‌హౌస్‌లో 'బస' చేస్తాడు.

రోజూ ఉదయాన ఒకే సమయానికి ఆ "రీపర్" గొంతు కొడవలి చప్పుడు అతన్ని వెంటాడుతుంది.

ఆ కాశ్మీర్ భాష అతనికి అర్థం కాదు. కాని ఆమె గొంతు చాలా మధురంగా వుంటుంది.

భావం సరిగా తెలియకపోయినా ఒక విధమైన "వేగోని" ఆ పాటలో స్పష్టంగా అతనికి వినిపిస్తుంది.

ఆ పాట ఒకే టైములో ప్రతి రోజు ఆ వేలిలో వినిపిస్తుంది.

ఆసక్తితో అతడు (కవి) గుఱ్ఱంమీద వెళ్ళి ఆ చుట్టు ప్రక్కల అంతా గాలిస్తాడు.

కాని ఆ అమ్మాయి కనిపించదు.

విషాదమైన ఆమె గీతం మాత్రం అతనికి వినిపిస్తుంది.

పని అయిపోగానే ఆ గెస్ట్‌హవుస్ ఖాళీ చేసి అతడు తిరిగి తన స్వగ్రామం వెళ్ళిపోతాడు.

కాని.......

చాలా రోజులపాటు ఆ అమ్మాయి......... ఆ ప్రదేశం......... ఆ వేలిలో ప్రతిధ్వనించే విషాదమైన ఆమె కంఠం...... ఇవన్ని అతన్ని వెంటాడతాయి.

"ఆమె ఎందుకంత విషాదంగా పాడింది?

ఆ పాట అర్థం ఏమిటి?"–

ఈ ప్రశ్నలు కవి హృదయాన్ని కలిచి వేస్తాయి.

"దిరీపర్" వ్రాస్తాడు.......

* * * * * *

సంధ్యకి ఎందుకో...... ఆ కాశ్మీర్‌లో విహరిస్తు అక్కడి కన్నె పడుచుల్ని అందాల్ని చూస్తున్నప్పుడు, వాళ్ళ పెద్ద పెద్ద గడ్డి మూటలు, క్యాబేజి, కాలిఫ్లవర్ మూటలు నెత్తిమీద పెట్టుకుని పోతుంటే వర్డ్స్‌వర్త్ కవిత్వం జ్ఞాపకం వచ్చింది.

ఆ మర్నాడు సోనామార్గ్ వెళ్ళారు.

ఎండాకాలం ఫరవాలేదు. కాని చలికాలం అక్కడ కుప్పలు కుప్పలుగ విపరీతంగా మంచు పడుతుంది. దారంతా మూసుకుపోతుంది.

కూలీలు ఎప్పటి కప్పుడు పరికరాలతో ఆ మంచుని పక్కకి తొలగించి టూరిస్టులకి ఆటంకం కలగకుండా దారి శుభ్రం చేస్తారు.

తెల్లగా దూది పింజెల్లా మంచు కురుస్తుంటే చూడటానికి చాలా అద్భుతంగా వుంటుంది.

టూరిస్టులు ఆ మంచు పొడిని చేతుల్తో పట్టుకుని ఇసక జల్లుకొన్నట్లు ఒకరిమీద ఒకరు చల్లుకుంటారు.

ప్రభాకర్ కూడా చేతులనిండా మంచు పొడి తీసి సంధ్య మీద జల్లాడు.

"అబ్బా చలి!" అంటూనే సంధ్య కూడా ప్రభాకర్‌తో మంచులో సరసాలు ఆడింది.

ఉన్ని కోట్లు వేసుకున్నా చలి ఆగదు.

అక్కడ అన్ని కాస్మోపాలిటన్ హొటల్స్.

అన్ని బార్-కమ్ రెస్టారెంట్స్.

ఇక్కడ ఆంధ్రాలో ఫామిలీతో కాఫీ హొటెల్సుకి వెళ్ళినట్లు అక్కడ అంత ఆడవాళ్ళతో బార్‌కి వెళ్ళటం చూసి సంధ్య ఆశ్చర్యపోయింది.

చలి ప్రదేశం కావటంతో అక్కడ హాట్ డ్రింక్స్ బాహాటంగానే చేస్తారు. ఇళ్ళల్లో సయితం ఆడవాళ్ళు హుక్కా తాగుతారు. (గంజాయి)

పైగా వివిధ ప్రాంతాలనుంచి టూరిస్టులు వస్తారు. రక రకాల వేష భాషలు. వరల్డ్ మేప్ అక్కడ చూడవచ్చు అనిపిస్తుంది.

అక్కడ వున్నన్ని రోజులు ప్రభాకర్ కూడా రోజూ బాగా పట్టించేవాడు. 'స్టఫ్' చేసిన కోడిని తెప్పించుకునేవాడు. సంధ్యకి "ఎగ్ ఫ్రై" ఇష్టం అని స్పెషల్‌గ

# ప్రేమపూజారి

**ఇమంది రామారావు**

ప్రేమారావు పేరు మీకు కొంచెం ఆశ్చర్యంగానే వుండచ్చు నిజం.... ప్రేమారావు వున్నాడు. వర్షాలు కురిసినపుడు పిల్లాడు పుడితే వరుణారావని, మేఘాలు ఉరిమినపుడు పుడితే మేఘారావని, పుట్టిన పిల్లలు ఎవరూ దక్కకపోతే పెంటయ్యని, వల్లమాలిన ముద్దుల కొడుకుని పుల్లయ్యని. యిప్పటికే ఆంధ్రదేశం మారుమూలల గ్రామాల్లో పిలుచుకుంటున్న వాళ్ళలో ప్రేమారావు తల్లి దండ్రులూ వున్నారు. అలాగే ప్రేమారావూ వున్నాడు

ప్రేమారావు తల్లిదండ్రులు ఒక్కగానొక్క కొడుకు కదాని ముద్దుగా 'ప్రేమ' అని పిలుచు కుంటుండేవారు. ఈ పిలుపు మరి ఆడపిల్లని పిలిచినట్టు వుంది. మార్చమని ఆడపిల్లలు అల్లరి చేస్తే 'రావు' తగిలించారు. ప్రేమారావు నాలుగ్గోడల మధ్య పెరిగాడు. మనిషికి కావలసిన బరువుకంటే నాలుగింతలు పెరిగాడు అడ్డంగా. బి. యెస్సి అయిందని పించుకున్నాడు. లక్కీగా హెల్త్ మ్యూజియమ్‌లో ఎడ్యుకేటర్‌గా ఎపాయింట్ అయ్యాడు. పదిహేను వందల జీతం. జీతంతో పని లేకుండా మరో రెండు వేలదాకా ఇళ్ళ అద్దెలు. యింకా తాత ముత్తాతల స్వార్జితం కూడా ప్రేమారావుకే చెందుతుంది. ఒక విధంగా ప్రేమారావు అదృష్టవంతుడే!

మరోలా ఆలోచిస్తే ప్రేమారావు చాలా దుర దృష్టవంతుడు ప్రేమారావుకి యిల్లూ కాలేజీ, చదువూ, ప్రస్తుతం ఆఫీసూ, యిల్లూ ఒకటి రెండు సార్లు వెంకటేశ్వర వైభవం. సీతాకళ్యాణం లాంటి సినిమాలు చూడటం తప్ప మిగతా ప్రపంచజ్ఞానం శూన్యమై పోయింది. ప్రేమారావు జీవితంలో 'ప్రేమ'కు చోటు లేకుండా ఎంతకాలం యాంత్రికంగా గడిచిపోయిందో అర్థమయ్యింది. యిక మరో సమయం కూడా వేస్టు చేయకుండా, ఎవర్నయినా ఒక అమ్మాయిని అర్జంటుగా ప్రేమించేయాలని నిర్ణయానికొచ్చేశాడు. ఎవర్ని ప్రేమించాలి? అనసూయని ప్రేమిస్తే! పాపం పూర్ టైపిస్ట్.... మొగుడు కూడా పోయాడు. ఎలా రియాక్ట్ అవుతుందో అసలు తన పర్సనాలిటీ చూసి భయపడే ఆడవాళ్ళ శాతమే ఎక్కువ. టైము చూశాడు. అయిదు కావస్తోంది. యింకో పది నిముషాల్లో అనసూయ ఫైల్సు తీసుకొని తనదగ్గర కొస్తుంది. టికిల్ చేసి యిచ్చు అనుకొంటూ మొహాన్ని మూడుసార్లు హాండ్‌కితో పట్టి పట్టి తుడుచుకున్నాడు. యింతలో అనసూయ రానే వచ్చింది. పైట చుట్టూతా కప్పుకుంది. అలా పైట కప్పుకోవడం ప్రేమారావు కేం బాగోలేదు. చిరు నవ్వుతో ఫైల్సు టేబులు మీద వుంచుతూ "ఏవిటి.... 'అలా చూస్తున్నారు?" అని సన్నటి నవ్వురువ్వింది. అనసూయ అలా నవ్వుతుందనుకోలేదు. ఆమె నవ్వితే నవమినాటి వెన్నెల్లా వుంటుంది. "నిన్నూ.... నీ అందాన్ని!" అన్నాడు హస్కీ గొంతుతో అతగాడి భాష ఆమెకు అర్థమయిపోయింది.




"రేపు నాకు శలవు కావాలండీ! ఆఫీసులో వర్క్‌లోడ్ గురించి నాకు తెలుసు అయినా తప్పని సరి పరిస్థితిలో అడుగుతున్నాను!" అంది అనసూయ చిన్నగా నవ్వి.

అనసూయ మళ్ళీ నవ్వింది. సరాసరి గుండెల్లోకి దూసుకు పోయేలా నవ్వింది. తన మీద యిష్టం లేకపోతే. ఎందుకు యింత సన్నగా. యింత చిన్నగా నవ్వుతోంది. "అనసూయా! రేపు ఒక్కనాడే కాకపోతే అవసరం వుందనుకుంటే వారం రోజులు తీసుకో... నేను కాదంటానా? నాగురించి నీకు బాగా తెలుసు. నేను చాలా ఫ్రాంక్. నా మనసులో ఏదీ దాచుకోలేను అందుకే చెప్పేస్తున్నాను. "అనసూయా.... ఐ.... ఐ... లవ్... యూ!" అంటూ చటుక్కున ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. అంతే! ప్రేమారావు చెంప చెళ్‌మంది. అనసూయ పరుగులాంటి నడకతో వెళ్ళిపోయింది.

* * *

ప్రేమారావుకి ప్రేమపిచ్చి పట్టుకుంది అన్నది ఆఫీసులో బాగా ఎస్టాబ్లిష్ అయ్యింది అనసూయ పుణ్యమా అంటూ – అనసూయ చెంప దెబ్బ తగిలిన తరువాత ప్రేమారావుకి చాలా కాలం ప్రేమ పైత్యం ప్రకోపించ లేదు. ఒక రోజు షడన్‌గా ప్రేమారావుకి ప్రాణ స్నేహితుడు కరుణాకర్ కనిపించాడు. హైదరాబాద్‌లో మూడు నెలల పాటు సివిల్ సప్లైస్‌లో సూపర్‌వైజర్‌గా ట్రైనింగ్ కొసం వచ్చానని చెప్పేడు. ప్రేమారావుకి కరుణాకర్‌కి ప్లస్‌కి మైనస్ మధ్య వున్నంత తేడా వుంది. తూర్పుకి పడమరకి

# ప్రేమ పూజారి

మధ్య వున్నంత వ్యత్యాసముంది. అయినా ప్రాణ స్నేహితులు. కరుణాకర్. ఎంత అందంగా వుంటాడో అంత అందంగా మాట్లాడ గలడు. కరుణాకర్‌తో ఇట్టే పొద్దు గడిచి పోతుంది. ప్రేమారావు యింట్లో బస చేశాడు కరుణాకర్ ప్రతిరోజూ రాత్రి నిద్రపోయే ముందు తనకు సిటీలో తటస్థించిన అమ్మాయిల్ని గురించి. రోజుకో ప్రేమకథ సృష్టించి మరీ చెబుతుంటే ప్రేమారావుకి పిచ్చెక్కి పోయింది. 'ఒరే కరుణా' నన్ను మరెవరూ ప్రేమించ రేమోరా. మనిషిని రోజు రోజుకి అష్టంగా పెరిగి పోతున్నాను కదూ" అడిగాడు అమాయకంగా. అలా ప్రేమారావు దీనంగా 'ప్రేమ' కోసం పరితపిస్తుంటె నిజంగానే కరుణాకర్‌కి జాలేసింది

నీకేంరా నువ్వు హేండ్‌సమ్‌గానే వుంటావు. కాదంటె లోక్యం తెలీదు. సరే. రేపు నీకో అందమయిన పెయిర్‌ని సెటప్ చేస్తాను, జాగ్రత్తగా మానేజ్ చేసుకో!' అన్నాడు అభయ హస్తం యిస్తూ. ప్రేమారావు కంటికి కరుణాకర్ తిరుపతి వెంకటేశ్వరుడిలా కనిపించాడు. రేపె తన జీవితంలో మధురమయిన రోజు. తెల్లవార్లూ ప్రేమారావుకి నిద్ర పట్టిందికాదు

'ఫర్‌హాన్స్'లో బ్లాక్ సండే ఆడుతోంది అక్కడ సెటప్ చేశాడు కరుణాకర్. రెడీగా థియేటర్ దగ్గర ఇద్దరమ్మాయిలు తమ కోసమే వెయిట్ చేస్తున్నట్టుగా కనిపించారు. కరుణాకర్ కనిపించగానే సుధారాణి ఎగిరి గంతేసి హాయ్ కరుణా!' అంటూ కరచాలనం చేసింది. ప్రేమారావు ఒక వెర్రి నవ్వు నవ్వి తనను పరిచయం చెయ్యమని కరుణాకర్ చెయ్యి గోకాడు పరిచయం చేశాడు. ఆమె! ఆమె పేరు లలిత! నిజంగానే లలితంగా వుంది. 'నైస్ టు మీట్‌యూ!' అంటూ చెయ్యి చాపేడు ప్రేమారావు లలిత తీయగా నవ్వి పైటతో మొహం అద్దుకొంది

సినిమా స్టార్టయ్యింది ఒరేయ్ నా గురించి అంతా చెప్పేవా' అంటూ కరుణాకర్ చెవిలో గొణిగాడు ప్రేమారావు కరుణాకర్‌కి చికాకు అనిపించి. "హుష్ ... కీప్ క్వయిట్.. అన్ని జాగ్రత్త పడ్డాను గో ఎ హెడ్" అన్నాడు. మొత్తం అర్థమయ్యేలా... సినిమా జరుగుతోంది తెరమీద మారు దృశ్యాలతో బాటు కరుణాకర్ సుధారాణిల ప్రవర్తన కూడా మారుతోంది సుధారాణి సొంతం కరుణాకర్ ఒడిలో వాలి పోయింది. లలిత మాత్రం సినిమా చూడ్డంలో నిమగ్నమయి పోతూనే చెయి తగిలించింది. ప్రేమారావు చటుక్కున చేయిని తన చేతిలోకి తీసుకున్నాడు. లలిత కిసుక్కున నవ్వింది. ప్రేమారావుకి కొండంత ధైర్యం వచ్చేసింది. సినిమాలో కమేడియన్ చేస్తున్న కామెడీని ఎంటర్‌టియిన్ చేస్తుంది లలిత. తనూ నవ్వుతూ శృతి గలిపేడు మనసులోనే కరుణాకర్‌కి శతకోటి థాంక్సులు చెప్పేసుకున్నాడు.

"మీరేం చేస్తుంటారు?" మాట కలిపేడు. ప్రేమారావు.

'సి. బి. ఐ.లో క్లార్క్" అంది తీయగా. తను మీరేం చేస్తుంటారు? అని అడుగుతుందను కొని గొంతు సవరించుకొని ఆగిపోయాడు. గాని ఆ ప్రశ్న అడగలేదు. మరో ప్రశ్న అడిగింది.

"మీకు పెళ్ళయ్యిందా?" అంది ఆసక్తిగా లలిత ప్రేమారావు గుండె ఝల్లు మంది ఏం సమాధానం చెప్పాలో తెలీని అయోమయ పరిస్థితి ఆలోచనలో పడ్డాడు. పెళ్ళికాలేదింకా" అంటే పెళ్ళి చేసుకో మంటుంది ఇప్పట్లో తనను పెళ్ళి చేసుకొనే వాళ్ళు కాదు తనకు కావలసింది ప్రేమించేవాళ్ళు.

"మాట్లాడరేం?" చేతో్ కుదుపుతూ చనువుగా అడిగింది. "నాకు పెళ్ళయిందండి. బట్ షి ఈజ్ మాడ్... సింప్లి ఐ... హేట్ హెర్!" అన్నాడు సిరియస్‌గా. లలిత రియాక్టయ్యింది "ఒహ్.... సారి" అంటూ ప్రేమారావు చేతిలో నలుగుతోన్న చేతిని వెనక్కి తీసుకుంది. తెరమీద రొమేన్సు జరుగుతోంది. కరుణాకర్ సుధారాణిని దగ్గరకు తీసుకున్నాడు వింత చప్పుడు వినిపించింది. ప్రేమారావు వొంట్లో రక్తం ఉడికి పోతుంది. పక్కకి చూశాడు. కరుణాకర్ సుధారాణిని.... గ... ట్టి.... గా ముద్దు పెడుతునే వున్నాడు. యిక ఆగలేక పోయాడు. లలితను దగ్గరకు చటుక్కున లాక్కొని బలంగా 'ముద్దు" పెట్టుకో బోయాడు. అంతే! మళ్ళీ ప్రేమారావు మూతి వాచి పోయింది.

"యూ ఇడియట్!" అంటూ బయటకు నడిచింది. 'లలితగారూ.... లలితగారూ!" అంటూ వెంటబడ్డాడు ప్రేమారావు. ఆ వెనుక సుధారాణి కరుణాకర్ నడిచారు. వారికి విషయం అర్థం కాలేదు. "లలితగారూ.... సారి... కంట్రోల్ చేసుకోలేక పోయాను. క్షమించండి!' బ్రతిమాలాడు ప్రేమారావు.

"రాస్కెల్... కట్టుకున్న పెళ్ళాన్ని పిచ్చి దానికింద జమకట్టి బయట ప్రేమకలాపాలు కావలసి వచ్చాయా? నీకు మానెర్స్ వుందా" ఉక్రోషంగా అడిగింది. కరుణాకర్‌కి తల తిరిగి పోయింది.

"లలితగారూ... మీరు "ప్రేమను" అపార్థం చేసుకుంటున్నారు. ఆయన కింకా పెళ్ళే కాలేదు. అందుకే మిమ్మల్ని పరిచయం చేసింది. వాడు యింతవరకు కఠినమయిన బ్రహ్మచర్యాన్ని సాధించాడు!" అంటూ ప్రేమారావు బ్రహ్మచర్యాన్ని గొప్పగా చెప్పేడు. అందుకు లలిత శాంతం వహిస్తుందేమో అనుకున్నాడు. అయితే ఆమె మరింత రెచ్చి పోయింది.

'అంటె అబద్ధాలు ఆడటం ఆయనకు వెన్నతో పెట్టిన విద్యన్న మాట యి పెళ్ళికాక ముందె యిన్ని అబద్ధాలు ఆడినవాడు రేపు పెళ్ళయ్యాక మరెంత మోసం చేస్తాడో ఛీ! ఛీ! ఎంత బరితెగించాడు" అంటూ కోపంగా ఆటోలో కూర్చుంది లలిత. సుధారాణి లలితని ఫాలో అయ్యింది. "ఆటో పోనివ్!" ఎక్కడికో చెప్పకుండా అరిచింది. ఆటో ప్రేమారావుకి, కరుణాకర్‌కి నవియర్‌గా వార్నింగ్ యిచ్చినట్టు అరిచి స్టార్టయ్యింది.

"ప్రేమారావ్ ఎంత పని చేశావ్‌రా! పెళ్ళయ్యిందని అబద్ధం ఎందుకు చెప్పేవురా రాస్కెల్!" అన్నాడు చిరుకోపంతో. ఏం చేయనురా. యిక ముందు ఏది నా స్వంత తెలివి తేటలతో ఆలోచించను. నీ మీద ఒట్టు.... సరేనా?" అంటూ జాలిగా కరుణాకర్ కళ్ళల్లోకి చూస్తూ స్కూటర్ ఎక్కేడు

* * * *

కరుణాకర్ చెల్లి 'శాంత' వచ్చి నెలరోజులయింది. 'శాంత' చాలా అందంగా వుంటుంది. చాలా రిజర్వ్‌డుగా వుంటుంది. కరుణాకర్‌కి మరో ఐది రోజుల్లో ట్రైనింగ్ పూర్తవుతుంది. కరుణాకర్ వెళ్ళిపోతే అసలు ప్రేమ చిట్కాలు చెప్పేవాళ్ళే కరువయి పోతారు. 'చెల్లి'కి హైదరాబాద్ సిటీ చూపించడంలో అసలు కరుణాకర్ ప్రేమారావుతో మాట్లాడ్డానికే వీలు చిక్కడం లేదు. ఒక రోజు



# కోటయ్య అనుభవం- స్వనోటనే విందాం































పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.




(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

తెలిగ్గా కరుణాకర్ వాలు కుర్చీలో పడుకొని సిగరెట్ రిలాక్సింగ్‌గా కాలుస్తున్నాడు.

"ఒరేయ్ కరుణా! నువు మరో పది రోజుల్లో వెళ్ళి పోతావు. ఎలా ముదిరిపోయిందో నాలో ఈ ప్రేమ పైత్యం. నేను ఎవర్నో ఒకర్ని వెంటనే ప్రేమించక పోతే బ్రతకనేమోరా. ఆఫీసులో అందరికీ తెలిసి పోయింది. యిరుగు పొరుగులూ అదోలా 'నన్ను' జాలిగా చూస్తున్నార్రా. ప్లీజ్... ప్లీజ్! ప్రేమసూత్రాలు చెప్పరా. యివ్వి రెండూ చేతులు కావురా!" అంటూ చేతులు పట్టుకున్నాడు.

కరుణాకర్ సిగరెట్ చివరిదమ్ము పీల్చి. పారేసి ఒరేయ్ ప్రేమా! అసలు ఈ ప్రపంచంలో ఎవడయినా ఆడదాన్ని ప్రేమించేందుకు పరుగెత్తే ముందు కొన్ని ఫండమెంటల్స్ తెలుసుకోవాల్రా. ఎవరయినా ఒకమ్మాయిని ప్రేమించాలనుకుంటే ఆ అమ్మాయిలో అందంగురించి. ఆ అమ్మాయిలో ఆకర్షణలు గురించి. నోరు నెప్పి పెట్టే దాకా పొగడాలి. ఆమె నవ్వు మీద. ఆమె చూపుల మీద. ఆమె నడక మీద. తన కొచ్చిన, తనకు తెలిసిన అందమయిన తియని మాటలన్ని ప్రయోగించాలి. కవిత్వం చెప్పాలి. ఆమె కళ్ళల్లోకి సూటిగా చూడాలి. చూపుల్లో చూపు కలిశాక పెదవుల మీద చిరునవ్వు రంగరించుకుంటూ మాట్లాడటం మొదలు పెట్టాలి!"

మంత్ర ముగ్ధుడులా వింటున్నాడు ప్రేమారావు. నువ్వు ఎంత సేపు మాట్లాడినా పెదవుల మీద నవ్వు చెదిరిపోకుండా జాగ్రత్త పడాలి. ఆమె కూడా నీలా చేసిందనుకో.... డిస్పర్స్ అయినపుడు టాటా చెప్పాలి. రెండవ రోజు షేక్ హేండ్ యివ్వాలి. మూడవ రోజు "ముద్దు" పెట్టుకోవాలి. అయితే యివన్ని చాలా కేర్‌ఫుల్‌గా చేయాలి. ఒళ్ళు దగ్గరుంచుకొని. నియమనిష్ఠలతో చేయాలి. ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా... అది అది నీ అదృష్టం మీద ఆధారపడి వుంటుంది. 'చెయ్యా-చెప్పా' అన్నది అంటూ తారకమంత్రం పూర్తి చేశాడు. ప్రేమారావుకి జ్ఞానోదయం అయిన ఫీలింగు కలిగింది.

బుర్రలో వెయ్యి వోల్టుల బల్బు వెలిగినట్లయ్యింది మరోసారి కరుణాకర్ చెప్పిన ప్రేమసూత్రాలన్ని ప్రేమారావు మననం చేసుకున్నాడు. ఎదురింటి పార్వతిలో చాలా వరకు కరుణాకర్ చెప్పిన గుణాలు వున్నాయి. తనగురించి ఎదురు చూడటం . తను నవ్వితే నవ్వడం తను ఆఫీసు నుండి రాగానే పనికల్పించుకొని యింటికి రావడం. కల్పించుకొని మాట్లాడ్డం యివ్వన్నీ చేస్తుంది. అయితే యింకేం? ప్రేమించేయొచ్చన్న మాట. ఒకటి రెండు సార్లు పార్వతిని మొట్టికాయలు కూడా పెట్టాడు. తాను చెప్పు తియలేదు. చెయ్యి చేసుకోలేదు. అంటే... లైను క్లియరయి పోయిందన్న మాట!

పార్వతి రావడం. గంటల తరబడి మాట్లాడటమూ జరిగిపోయింది. లేచి నిలబడి యింటికి వెడతానంది. షేక్‌హేండ్ తీసుకున్నాడు. యిక మిగిలిందల్లా 'ముద్దు' ఒక్కటే. పార్వతి ధోరణి చూస్తుంటే అదేమంత పెద్ద సమస్యనిపించడం లేదు. పార్వతిని దగ్గరకు తీసుకున్నాడు. చటుక్కున ఆమె పెదవులందుకున్నాడు. అంతే! పార్వతి విదిలించుకుంది. కాలి చెప్పు తీసింది.

"ఛీ ఛీ! యింతేనా నన్ను అర్థం చేసుకున్నావ్. నిన్ను.... నిన్ను...." అంటూ మళ్ళీ చెప్పు నేలకేసి కొట్టింది. ఆ చెప్పుతో తన మొహం పచ్చడి చేసేసినట్లనిపించింది ప్రేమారావుకి.

"పార్వతీ.... ఏంటిది?" అన్నాడు అయోమయంగా చూస్తూ. పార్వతి కళ్ళు చింత నిప్పుల్లా మారిపోయాయి. "నువు మంచివాడివనుకున్నాను. ఏ చెడ్డ అలవాట్లు లేని మనిషివని. నతో స్నేహం చేశాను. చదువుకున్న వాడివని, సంస్కారం తెలిసిన వాడివనీ కాస్తంత చనువుగా వుంటే. యిదేం పోయేకాలం?" అంటూ కడిగేసింది.

"లేదు.... లేదు పార్వతీ నువు నన్ను మోసం చేశావు. నాతో నవ్వుతూ మాట్లాడావ్. నా కళ్ళల్లో కళ్ళు పెట్టి చూసావ్. నేను చూస్తుండగా పైట జార్చావ్. నన్ను పూసుకొంటూ తిరిగావ్. నాకు టాటా చెప్పేవు. షేక్ హేండిచ్చావు. యివ్వంది అదొకటే.... ముద్దొకటే... నన్ను అమాయకుడ్ని చేసి ఏడిపిస్తున్నావ్. యిది న్యాయం కాదు!" అంటూ ఏడ్చినంత పని చేశాడు ప్రేమారావు. అతని మాటలకి. నవ్వాలో ఏడవాలో తెలిసింది కాదు పార్వతికి.

"చూడు మిష్టర్ ప్రేమారావ్.... యివన్నీ నీకుగా నువ్వు కల్పించుకున్నవి. నీలో నువ్వు గోరంతల్ని కొండంతలు చేసి ఊహించుకున్నవే. ఒక్క విషయం గుర్తుంచుకో! నెల రోజుల పరిచయంలోనే నీ కోరికలు తీర్చే స్థాయికి వచ్చిన ఏ ఆడది సంసారికాదు పచ్చి తిరుగుబోతు అయి వుంటుంది నీలాగా. అలాంటి వారిదగ్గర నీ ఆటలు సాగుతాయి. ఈ విషయం మా పెద్దవాళ్ళకు చెప్పేనంటే నువు చెప్పుల్లేకుండా అయిపోతావ్... మైండిట్" అంటూ మొహాన ఊసినంత పనిచేసి చకచకా నడుచుకొంటూ వెళ్ళిపోయింది. ప్రేమారావు తల గోక్కున్నాడు. కరుణాకర్ ప్రేమసూత్రాలు తప్పా? కరెక్టుగానే ఫాలో అయ్యేనే. అంటే ప్రేమకు నెలరోజులు వ్యవధి చాలదన్న మాట.... ఏవిటో ఈ ప్రేమ పిచ్చి.... తన ప్రేమ ఎప్పుడు ఫలిస్తుందో. శూన్యంలోకి చూశాడు భూమితో బాటు ఆకాశం కూడా గిర్రున తిరుగుతున్నట్టనిపించింది.

* * *

కరుణాకర్ పగలబడి నవ్వాడు. 'ప్రేమారావు' అనుభవాలు విన్నాక 'శాంత' పొట్ట చెక్కలయ్యేలా నవ్వకుండా వుండలేక పోయింది ప్రేమారావ్ మౌనంగా ఆఫీసుకు వెళ్ళిపోయాడు. కరుణాకర్ మరో రెండు రోజుల్లో చెల్లితో స్వగ్రామం ప్రయాణానికి అన్ని ఏర్పాట్లు పూర్తి చేశాడు.

శాంత మనసు అదే పనిగా ప్రేమారావ్‌ని గురించి ఆలోచిస్తోంది. ఎంత అమాయకుడు! ఏ అలవాట్లూ లేని మనిషి ప్రేమారావు నిజంగా 'ప్రేమ'కు అర్హుడుకాడా?... ఊహూ ఎం దుక్కాడు. మనసులో కోటి ఆలోచనలు.

సాయంత్రం ఆఫీసు నుండి ఎర్లీగానే వచ్చాడు ప్రేమారావు. కరుణాకర్ యింకా యింటికి రాలేదు. వెధవ! సుధారాణితో ఏసినిమాకో చెక్కేసివుంటాడు.



వున్న రెండు రోజులూ తనతో హాయిగా గడపచ్చు కదా- వీడొక్కడే మహా రోమియో అయినట్టు తిట్టుకుంటూ కూర్చున్నాడు.

శాంత అందంగా అలంకరించుకుంది మునుపట కంటే "కాఫీ తీసుకోండి" శాంత మాటలు కొత్తగా అనిపించాయి. కాఫీ తాగాడు కాఫీ 'రుచి'లో మార్పు కనిపించింది. కాఫీ 'నీలా' చాలా చాలా బావుంది. అన్నాడు శాంత సిగ్గుతో తల వంచుకుంది అలా శాంత సిగ్గుపడటం ప్రేమారావుక ఏదోలా అనిపించింది.

"రెండ్రోజుల్లో మేము వెళ్లిపోతున్నాం! అంది శాంత ఆ గొంతులో ఏదో తెలియని బాధ చోటు చేసుకుంది. "మంచిది! అన్నాడు తన వైపు చూడకుండానే. శాంత ప్రేమారావు యిలాంట సమాధానం యిస్తాడనుకోలేదు.

"మేము వెళ్ళిపోతుంటే మీకు బాధగా లేదూ?" అనడిగింది మరికాస్త దగ్గరగా వచ్చి. ప్రేమారావు పేలవంగా నవ్వాడు. 'బాధగా వుంటే మాత్రం గవర్నమెంటు ఉద్యోగం చేయక తప్పదు కదా!" అన్నాడు పెద్ద అనుభవస్థుడిలా ఫోజు పెడుతూ.

"అది కాదండి నా గురించి మీరేమనుకుంటున్నారు?" అనడిగింది హస్కీగా. ప్రేమారావు శాంత కాలికేసి చూశాడు చెప్పుల్లేవు మొహంలోకి చూశాడు ప్రసన్నంగా వుంది. శాంత ధోరణి అర్థం కాలేదు.

"అసలు నన్ను గురించి నువ్వేమనుకుంటున్నావో నాకర్థం కావడం లేదు" అన్నాడు ట్యూబులైటులా మొహంపెట్టి.

"చెప్పనా!" అంది తీయగా.

"వెంటనే చెప్పెయ్" అన్నాడు కంగారుగా.

"ఏవండి. నేను వచ్చినప్పటి నుండి గమనిస్తున్నాను. మీరు చాలా మంచివారండి. మీలో అవలక్షణాలు ఏవీ లేవు. మీరు చాలా అమాయకులండి. అందుకే .. మీరంటే .. మీరంటే నా కిష్టం.. మిమ్మల్ని .. మిమ్మల్ని నేను.. ప్రేమిస్తున్నానండి... మీకు అభ్యంతరం లేకపోతే అన్నయ్యతో చెప్పి పెళ్ళి కూడా చేసుకుంటానండి!" అంది శాంత. ప్రేమారావు గుండెఝల్లుమంది. అపాదమస్తకం వణుకు పుడుతోంది. తనను .. తనను ఒకమ్మాయి ప్రేమించానని. తనే కోరి చెప్పడమా! నో. ఒక్కసారే ఈ సృష్టి అంతా స్థంబించుకు పోయినట్లనిపించింది. ఒక ఆడది కోరి "ఐ లవ్ యూ' అంటూ మగవాడ్ని దగ్గరకు తీసుకుంది అంటే, ఒక నెల రోజుల్లో పెళ్ళి దాకా వచ్చేసిందంటే "అది" తప్పనిసరిగా తిరుగుబోతై వుండాలి. పార్వతి చెప్పింది – అంతే! శరీరంలో రక్తం మరింత దుడుగ్గా ప్రవహించ సాగింది. కళ్ళు ఎర్రబడ్డాయి. పిడికిలి బిగిసింది.

'షవన్నావ్ మళ్ళీ అనూ!" అన్నాడు సీరియస్‌గా. శాంత ఏమాత్రం చలించలేదు. 'ధ్యూప్' చేస్తున్నాడనుకుంది. న వ్వి ం ది. "ఒక్కసారేవిటండి.. వందసార్లు .. లక్ష సార్లంటాను. ఐ లవ్ యూ. ఐ లవ్ యూ. ఐ. లవ్.. యూ.. ఒ. కె?' అంది వెన్నెల్లా నవ్వుతూ.

శాంత చెంప చెళ్‌మంది.

మరుక్షణంలో ప్రేమారావు చెంప చెళ్‌మంది.

కొట్టింది శాంత కాదు. కరుణాకర్. ప్రేమారావు కరుణాకర్‌ని స్థాణువులా చూస్తూ వుండిపోయాడు.

"రాస్కెల్! ఏవిట్రాయిది. నీ ప్రేమ పైత్యం తెలిసే మా చెల్లి యిక్కడికి వచ్చింది. అయితే నీలో మంచితనాన్ని చూసింది గాని నీ పిచ్చి ఆలోచనల్ని గురించి ఏ రోజూ ఆలోచించలేదు. మా చెల్లి నెన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్పింది గాని, నీలా బరితెగించి ముద్దు పెట్టుకోలేదే. ఫూల్ 'ప్రేమ'కు కావలసింది అర్థం చేసుకొనే మనసు. అది నీకు లేదు. నీ జీవితం యింతే!", అంటూ ంటనే ప్రయాణానికి సిద్ధమయ్యాడు.

ప్రేమారావుకి 'శాంత' పోకడ వింతగా తోచింది. తనే తొందరపడి చెయ్యి చేసుకున్నట్లు క్షణాలో నిర్ధారణ కొచ్చేశాడు.

"కరుణా! వెళ్ళిపోతున్నావురా!" అని అడిగా కంట తడి పెడుతూ. కరుణాకర్ మాట్లాడలేదు కరుణాకర్ పక్కనే శాంత మౌనంగా కూర్చుంది.

"కరుణా! నువ్వెళ్ళిపోతే పో... గాని శాంతని మాత్రం యిక్కడ విడిచిపెట్టు." అన్నాడు బాధగా. కరుణాకర్ ప్రేమారావు మొహంలోకి చూశాడు. పసిపిల్లాడి మొహంలా అనిపించింది. ఆ కళ్ళల్లో కల్లాకపటం లేదు.

"శాంతని విడిచి పెడితే ఏం చేస్తావ్. ప్రేమించానని చెప్పి." "ముద్దు పెట్టుకోను. పెళ్ళి చేసుకుంటాను!" అన్నాడు శాంత కళ్ళల్లోకి చూస్తూ కరుణాకర్ పగలబడి నవ్వాడు. శాంత, ప్రేమారావులూ శృతిగలిపేరు. □

# ఖః వేమన పద్యాలు




తొత్తుతోటి పొందు తొట్టు పెసలగింజ
ముచ్చుతోటి పొందు వచ్చునిందె
తలకు ముప్పువచ్చు ధరను తలారితో
పొందు సల్పు చెలికి పుడమి వేమ.

# గెలవండి! రూ 20,000/-ల విలువైన బహుమతులు!



## కలువబాల

## చందాదారులకు లక్కీడిప్: ఆగస్టు 1 నుండి నవంబరు 1 వరకు.

రు. 60లు చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది. అదిగాక మీరీ క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు.
"చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది.

మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా 'కలువబాల"కు ఏడాది "చందాదారులుగా" చేరడమే! కాకపోతే మీ 'చందా' సైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి కలువబాల నుంచి ఒక "చిరుకానుక" కాలక్రమంలో అందుతుంది.



కలువబాల
నవ వనితా పక్షపత్రిక

## ంవబాల లక్కీడిప్
## దాదారులకు
## ంధనలు సూచనలు.

ా పైకము రు. 60లు యార్డరు ద్వారా గాని, ాండు డ్రాఫ్టు ద్వారా గాని ంవచ్చును.

.ఒ.లు పంపేవారు వారి ఎన్‌తో పాటు, ఎమ్.ఒ. పంపిన తెలుపుతూ, దాని రశీదు జతచేసి కూపన్ పంపాలి. లేదా డి.డి.ని ఎన్‌తో జతచేయాలి.

ా భారత దేశంలో వున్న ంవరైనా కట్టవచ్చును

ా పైకము నేరుగా విజయవాడ, ్ధపత్రిక కార్యాలయంలో కూడా వచ్చును.

ఒ.లు, డి.డి.లు వ్యక్తుల పేర ంచకూడదు.

న్‌లు రిజిష్టర్డు పోస్టులో ంరాదు. లక్కీడిప్ గడువు పూర్తి ంన తర్వాత యిందులో పాల్గొన్న ాదారులకు చీట్లుతీసి, పైన ంన బహుమతులను ంచుతాము. ఈ విషయంలో ర ప్రత్యుత్తరాలకు తావులేదు.

న్‌మీద, మనియార్డరు కూపన్ మీదా ా పంపేవారి పేరు, చిరునామా స్పష్టంగా, ాగా వ్రాయాలి. వారు ఇదివరకే ాదారులైతే కూడా, వారి స్నేహితులెవరికైనా, వబాల" చందాను బహుమతిగా కట్టవచ్చును.

---------- కత్తిరించాలి ----------



నిజమయితే ✓
కాకపోతే ×
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. ( )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు :..................................

..................................

చిరునామా :..................................

..................................

..................................

ఎమ్ ఒ పంపిన తేది. ..................................

లేదా

డి డి. జత చేయడమైనది.

ంక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.

పన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా :

ంవబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి.

థకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము.

ఎక: ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము.

్ధపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌లో పాల్గొనరాదు.

సీరియల్

# కాలాగ్ని

## దూరి వెంకటరావు

(గత సంచిక తరువాయి)

చాలా సేపు నిరీక్షించిన తర్వాత హార్ట్ స్పెషలిస్ట్ డా. పరాంకుశశర్మ గారిని కలుసుకో గలిగింది. గవర్నమెంటు డాక్టరిచ్చిన కాగితాన్ని అతనికి చూపించింది.

డాక్టర్ శర్మ ఉత్తరం చదివి "మిస్ సరోజా! హార్ట్ ఆపరేషనుకు ఇక్కడ పాతికవేల రూపాయలు ఫీజు చెల్లించవలసి వుంటుంది" అన్నాడు ఆమె ముఖ కవళికలను గమనిస్తూ.

"అమ్మో" అంది సరోజ.

"మరేం ఫరవాలేదు. ఇది యాక్సిడెంట్ కేసు అవడంవల్ల గవర్నమెంటు సర్జను సిఫార్సుచేసినందున నువ్వు మినిమమ్ ఫీజు మాత్రం చెల్లించవలసి వుంటుంది."

"అంటే, ఏ మాత్రం" దడదడలాడుతున్న గుండెతో బిక్కు బిక్కుమని డాక్టరువైపు చూస్తూ అడిగింది సరోజ.

"ఐదు వేలు"

"డాక్టర్ నాదొక రిక్వెస్టు. ప్రస్తుతం నా దగ్గరంత సొమ్ములేదు. నేను మద్రాసువెళ్ళి వారం పదిరోజులలో మీకు డబ్బు పంపిస్తాను. ఎలాగైనా మా తమ్ముడికి ఆపరేషను చేసి పుణ్యం గట్టుకోండి" ఎంతో ప్రాధేయ పూర్వకంగా వున్నాయామె మాటలు.

"నువ్వు ఉన్న పళంగా డబ్బు కట్టినా వెంటనే ఆపరేషను అవదమ్మా! కేసు నిశితంగా పరిశీలించిన పిమ్మట దాని సీరియస్‌నెస్‌బట్టి డేటు ఫిక్స్ చేస్తాం"

"అంటే మేం కొంతకాలం ఇక్కడుండాలా"

"తప్పకుండా. కనీసం రెండు వారాలైనా వుండవలసి వుంటుంది. ఈ లోగా నువ్వు మద్రాసు వెళ్ళి డబ్బు ఏర్పాటు చేసుకోవచ్చు."

"మరి మా తమ్ముడు?"

"వెంటనే జాయిన్ చేసుకుంటాం. ఇక్కడ వాడికి కావలసిన సౌకర్యాలన్నీ వుంటాయి. ప్రతిరోజూ డాక్టర్లు టెస్ట్ చేస్తూ వుంటారు. నీకేం భయంలేదు. నువ్వు వెళ్ళిరామ్మా" ఎంతో ఆప్యాయంగా అన్నాడు డాక్టరు శర్మ.

"థాంక్స్. మీ మేలు ఈ జన్మలో మరచిపోలేను" కృతజ్ఞతలు చెప్పింది సరోజ.

ఆ రోజే చంద్రాన్ని హాస్పిటల్‌లో జాయిన్‌చేసి మద్రాసు బయలుదేరింది.

★ ★ ★ ★ ★

**జరిగిన కథ -7 :** తమ్ముడి శ్రేయస్సు కోరి రవితో పెండ్లికి నిరాకరించింది సరోజ. ఉద్యోగాన్వేషణలో తిరిగి ఇంటికి వస్తున్న సరోజ నలుగురు కిరాతకుల చేతుల్లో పడింది. వారు ఆమెను ఒక వేశ్యకు అమ్మేసి వెళ్ళిపోతారు. ఎలాగో ఆ వేశ్యా గృహాన్నుండి బయటపడుతుంది. సర్కస్‌లో ఫైర్ ఏక్సిడెంట్ వలన జరిగిన తొక్కిసలాటలో సరోజ తమ్ముడు చంద్రానికి గుండెకు బలమైన గాయం తగిలింది. ఆపరేషను చేయించడానికై తమ్ముడిని తీసుకుని రాయవెల్లూరు వెళుతుంది సరోజ.

మద్రాసు మహానగరంలో అడుగు పెట్టిన సరోజకు ఏ పని చేయాలో పాలుపోలేదు. ఎలాగైనా డబ్బు సంపాదించి తమ్ముణ్ణి రక్షించుకోవాలన్నదే ఆమె ప్రధాన ధ్యేయం. ఉద్యోగం కోసం ఊరంతా తిరిగింది. కాని ఎక్కడా పని దొరకలేదు. కనీసం పాచిపనైనా చేసి పదిరూపాయలు పోగు చేద్దామని గడప గడపకు వెళ్ళి అర్థించింది. "వయసులో వున్న అమ్మాయివి. పైగా అందంగా వున్నావు. నీలాంటిదాన్ని పనిలో పెట్టుకుంటే మా పచ్చని సంసారంలో లేనిపోని చిక్కులేర్పడతాయే తల్లీ" అంటూ ఏ గృహిణి దరిచేర నివ్వలేదు.

సరోజకు మతిపోయినట్లైంది. తన రూపమే తనకు శత్రువైనందుకు లోలోపలే కుమిలిపోయింది. ఆడదానికి అందం ఒక శాపమేమో ననిపించింది. చివరికి ఆమెలో ఏదో తెలియని తెగింపు, ధైర్యం వచ్చాయి. ఏ పనైనా చేసి ఈ సమాజంలో ఆర్థికంగా, అందరికంటే సుఖంగా బ్రతకాలని, తమ్ముణ్ని రక్షించుకుని వాడిని కూడా పైకి తీసుకురావాలని అనుకుంది.

తను అందగత్తెనని అందరూ ప్రశంశా పత్రాలిచ్చేసారు. అందువల్ల నైట్‌క్లబ్బులలో డాన్సర్‌గా చేరతానంటే అవకాశం దొరకకపోదు. పుష్కలంగా డబ్బు సంపాదించవచ్చు. కోటివిద్యలూ కూటికొరకే నన్నారు. ఈ వర్తమాన సమాజంలో బ్రతకడం కోసం, కేవలం బ్రతకడం కోసం ఎందరెన్ని పనులు చెయడంలేదు? అందులో ఆక్షేపణ ఏముంది? నిజాయితిగా, గౌరవంగా వుండి పస్తులతో మాడుతూవుంటే ఈ సంఘం తననేమి వుద్ధరించింది? అలాంటి సంఘం కట్టుబాటులో వుండవలసిన అవసరమేముంది?– ఇలా వివిధ కోణాల నుండి ఆలోచిస్తూ దృఢమైన నిర్ణయం తీసుకుంది.

ఆ రోజు హోటల్ ఉడిపిలో కడుపునిండా భోంచేసి, లాడ్జి ఎవరెస్టులో రూము తీసుకుని నిశ్చింతగా నిద్రపోయింది. భళ్ళున తెల్లారేసరికి గభీలుమని లేచిన సరోజ, తనప్పుడెక్కడున్నానా అని ఓ క్షణం ఆలోచించుకుని, వాస్తవం గుర్తుకు రాగానే చిన్నగా నవ్వుకుంది. రాత్రి బాగా నిద్రపట్టడంవలన వళ్ళంతా తేలిగ్గా వుంది. ఆవేళంతా లాడ్జిలోనే వుండి సాయంత్రమయ్యాకా వున్నంతలో శుభ్రమైన చీరకట్టుకుంది. వదులుగా తల దువ్వుకుని రబ్బరుబాండు పెట్టుకుంది. ముఖాన స్నోపౌడరు రాసుకుని నీటుగా తయారయి ఫైవ్‌స్టార్ హోటలు చేరుకుంది. తిన్నగా రిసెప్షన్‌లో కడుగుబెట్టి మేనేజర్ని కలుసుకుంది.

"వాట్ కెన్ ఐడు ఫర్ యు మేడమ్" ఎంతో స్మార్ట్‌గా అడిగాడు మేనేజరు.

"ఐ లైక్ టు జాయిన్ ఏజ్ ఎ డాన్సర్ ఇన్ యువర్ హోటల్" అన్నది సరోజ ధైర్యంగా.

"వెల్‌కమ్. యువర్ మదర్‌టంగ్ ప్లీజ్."

"తెలుగు"

"ఐ టూ– సో లెటజ్ టాక్ ఇన్ అవర్ లాంగ్వేజ్."

"ఐ హేవ్ నో అబ్జక్షన్."

"మీరు డాన్స్ బాగా చేయగలరన్నమాట" తెలుగులో అడిగాడు మానేజరు.

"ఊ" అన్నది సరోజ.

"మిస్ రీటా! ఈ అమ్మాయి కేబరేకి పనికొస్తుందేమో చూడు" అన్నాడు ఇంగ్లీషులో అక్కడున్న యువతిని సంభోదిస్తూ.

"కమిన్‌ప్లీజ్" ఆమెను మరో గదిలోకి తీసుకెళ్ళింది రీటా.

మౌనంగా ఆమె ననుసరించింది సరోజ.

రీటా సరోజను కొన్ని పరీక్షలు చేసిన తర్వాత బయటకొచ్చా రిద్దరూ.

"హౌ ఈజ్ హెర్ పెరఫారమెన్స్?" అడిగాడు మేనేజరు రీటానుద్దేశిస్తూ.

"ఈమెకు డాన్సంటే వచ్చుగాని ఆ నాట్యం మన హోటల్‌కు సూటుకాదు" అన్నది రీటా ఇంగ్లీషులో.

"ఐయామ్‌వెరిసారి మేడమ్. మాకు కేబరేడాన్సు చేయగల వనితలు మాత్రమే కావాలి" అన్నాడు మేనేజరు.

అతడి మాటలకు షాక్‌తిన్నట్లైంది సరోజ. ఇంతవరకు కనీసం డాన్సర్‌గా పని దొరుకుతుందని ఆశపెట్టుకుంది. ఇప్పుడా ఆశకూడా వమ్ము కావడంతో ఆమె గుండెలను ఎవరో బలంగా పిండినట్లైంది.

"సార్, నేను చాలా కష్టాలలో వున్నాను. డాన్సర్‌గా కాకుంటే మరేదైనా పనిచ్చి పుణ్యం గట్టుకోండి. మీ మేలు ఎన్ని జన్మలైనా మరచిపోలేను. ప్లీజ్ ప్రొవైడ్ ఎంప్లాయమెంట్ ఇన్ యువర్ హోటల్." ప్రాధేయపడింది సరోజ.

సరే, మీరేపని చేయడానికైనా సిద్ధమేనా?" అడిగాడు ఆమెను పరీక్షగా చూస్తూ.

"ఇప్పుడు నేనున్న పరిస్థితులలో ఏదో ఒకటి చేయక తప్పదు" అన్నది నిర్లిప్తంగా.

"అయితే మా హోటల్ "కాల్‌గర్ల్"గా చేరండి."

కాల్‌గర్ల్ చేయవలసిన డ్యూటీస్ ఏమిటో తెలియక ప్రశ్నార్థకంగా ముఖం పెట్టింది. ఆమె ఆ పదమే ఎన్నడూ వినలేదు.

'మరేం కంగారు పడకండి. మీరు చేయవలసిన పని చాలా సింపిల్. మా హోటల్లో దిగే కస్టమర్స్ ఎంజాయ్‌మెంటుకు మేము పిలవగానే రావాలి. ఆ రాత్రంతా వాళ్ళతో గడపాలి" అన్నాడు మానేజరు ఆమె అంతర్యం అర్థం చేసుకుని.

అతడి మాటలు వింటూంటే అది హైక్లాస్ వ్యభిచారమని సరోజకు తెలిసిపోయింది. నవ్య సమాజంలో నాగరికత అనే ముసుగులో వేశ్యకిచ్చే మరో పేరే కాల్‌గర్ల్ అని అర్థమైపోయింది.

ఇక తనకు ఆ పనితప్ప మరొకటి దొరకదని నిర్ధారణ చేసుకుని సరేనంది సరోజ

"మీకు రెసిడెన్సు మేమే ఏర్పాటు చేస్తాం. మీ డిమాండునుబట్టి మీ ఇన్‌కమ్ మారుతూ వుంటుంది. మేం ఎప్పుడు ఫోను చేసినా మీ రెక్కడుండాలి. మా టెర్మ్స్ అండ్ కండిషన్స్ కాపీనెప్పై అయితే ఈ ఫారంమీద సంతకం పెట్టండి." అంటూ ఏదో కాగితం నింపి సరోజ కిచ్చాడు.

సరోజ ఒకక్షణం ఆలోచించి "రోజీ" అని సంతకం చేసింది.

"బైది బై నేను చెప్పడం మరిచాను. మీరు రెండు మూడు యాంగిల్స్‌లో మీ ఫొటోలు మా కివ్వవలసి వుంటుంది"

"అలాగే"

"బోయ్!.... ఈమెను మన హోటల్ క్వార్టర్సుకు తీసుకెళ్ళు. వెళ్ళండి మేడమ్ ఇతడు మీకు కావలసిన ఏర్పాట్లన్నీ చూస్తాడు."

"థాంక్స్" బోయ్‌ననుసరించింది సరోజ మరి మారు మాట్లాడకుండా.

## 11

తన కన్నీటి గాథను చెప్పడం ముగించి కళ్ళు వత్తుకుంది సరోజ.

ఆమె చరిత్ర విన్న మధు ఆలోచనలో పడ్డాడు. సిగరెట్ కేసులోంచి సిగరెట్టు తీసుకుని వెలిగించి గట్టిగా రెండుమూడు దమ్ములు లాగాడు. అతడి మెదడు చురుకుగా పని చేస్తోంది. మంచం మీంచి లేచి అటు ఇటు తిరగసాగాడు.

మధు ఏమీ మాట్లాడకపోవడంతో "ఇదీ నా కథ" అన్నది సరోజ.

"ఊఁ" అన్నాడు యథాలాపంగా ఎటో చూస్తూ.

తన కథ విన్నాకా అతడు తనను అసహ్యించుకుంటున్నాడేమో! లేకుంటే కనీస సానుభూతైనా చూపివుండేవాడు. ఔను... అతడూ మగవాడే కదా!.... అవతార పురుషుడేంకాదు. ఐనా తన పిచ్చిగాని ముక్కు మొహం తెలియని వ్యక్తికి తన గాథ చెప్పుకోవడ మేమిటి? అతను సానుభూతి కనపరచలేదని బాధపడట మేమిటి? తనలో తనే నవ్వుకుంది. అతడంత పొత్తిడి చేయకపోతే తాను చెప్పేదేకాదు. అతడి మాటలు ప్రవర్తనను బట్టి అతడందరికంటె అతీతుడనుకుంది. అటువంటి వ్యక్తికి తన గాథ చెప్పుకుంటే తన మనస్సుకు కొంత ప్రశాంతత ఏర్పడుతుందని తలచింది. అతడు ఏమీ మాట్లాడకపోయేసరికి కోపం కూడా వచ్చింది.

"మీరేమీ మాట్లాడటంలేదు. నా గతమంతా విన్నాకా మీ కెలా అనిపిస్తోంచో చెప్పండి. నేనేమీ అనుకోను" అంది సరోజ మరి వుండబట్టలేక.

"చంద్రానికి ఆపరేషను చేసారా?" అడిగాడు.

"చేసారు"

"ఇప్పుడెలా వున్నారు?"

ఎంతో ఆరోగ్యంగా వున్నారు. అందుకే హాస్పిటల్ నుంచి తీసుకొచ్చి స్కూల్లో జాయిన్ చేశాను."

తమ్ముడికోసం ఊడిగమైనా చేయడానికి సిద్ధపడిన దానివి ఈ ప్రొఫెషను ఎంచుకున్నావేం?"

"గత్యంతరంలేక" పేలవంగా నవ్వుతూ అంది.

"ఈ లోకంలో నీ కంటే ఎంతోమంది [illegible] తిండి రెండోపూట [illegible] వున్నారు. [illegible] బ్రతుకుతున్నారా?" [illegible] అడిగాడు.

అతడు వేసే ప్రశ్నలు ఆమె కేమాత్రం [illegible]. కారణం తన అనుభవాలు అతనికేం తెలుసు? మగ పుట్టుక [illegible] అంటే ఏమిటో తెలియకుండా పెరిగి ఉద్యోగం చేసుకుంటూ [illegible] స్వతంత్రంగా బ్రతుకుతున్న అతనికి తన బాధ ఎలా అర్థమవుతుంది? తన జీవితంలోని సంఘటనలన్నీ అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్టు ఇంత విడమర్చి చెప్పినా అర్థం చేసుకోలేకపోతున్నందుకు ఎంతగానో నొచ్చుకుంది.

"మీ రన్నవాంట్లో తప్పేమీలేదు. [illegible] వృత్తిని కోరుకోరు." అంది అతడి ప్రశ్నకు సమాధానంగా.

"మరి నువ్వెంచుకోవడంలో అంతరార్థం?"

ఆ ప్రశ్నకు వెటకారంగా నవ్వుతూ, [illegible] చెప్పనక్కర్లేదు. మీ కీపాటికి అర్థమయ్యే వుంటుంది. [illegible] విన్నందీ– వాళ్ళందరికీ డబ్బులేకపోవచ్చు. సుఖంగా బ్రతకడానికి అవకాశం లేకపోవచ్చు. కాని శీలం మాత్రం వుంది. మరి నేను?..... ఆ శీలాన్ని కూడా పోగొట్టుకున్న దానిని. ఇంకా విడమర్చి చెప్పాలా?" ఎంతో ఉద్రేకంతో అంది సరోజ.

"సరే, సమస్యల సుడిగుండంలో చిక్కుకున్నప్పుడు, వాటికి పరిష్కారం కనుచూపు మేరలో కానరానప్పుడు, బలమైన పొత్తిడులకు లొంగిపోవలసి వచ్చిందని నాకు తెలుసు. అంత మాత్రాన నిత్యం అదే దావుందనుకుని వ్యభిచారిణిగా మారాలని ఎక్కడుంది?" నిలదీసి అడిగాడు మధు.

## కాల్ గర్ల్

ఏమిటీ అధికారం తనపై? అతడడిగిన ప్రశ్నలన్నింటికి సహనంతో సమాధానాలు చెప్పే అవసరం తనకేమిటీ? అతడన్ని ప్రశ్నలు నిలదీసి అడుగుతూ వుంటే అపరాధిలా చేతులు జోడించుకుని వాటన్నింటికి సమ్మాయిషీ తనెందుకు చెప్పుకోవాలి? "మీరు మరి నన్నేమి అడగకండి. మీరువేసే ప్రతి ప్రశ్నకి సమాధానం చెప్పుకోవలసిన ఖర్మ నాకేంలేదు. శలవ్" అని చెప్పి వెళ్ళిపోవాలనిపించింది. కాని మరెందుకో ఆ మాటలనడానికి పెదిమలు విడటంలేదు. అతనితో కటువుగా మాట్లాడటానికి తన మనస్సెందుకో అంగీకరించటంలేదు. ఏమిటీ బంధం?.... ఏమిటీ బలహీనత?.... ఇలా ఆలోచిస్తూ "నిజమే. మీ రన్నదాంట్లో నిజం లేకపోలేదు. వ్యభిచారిణిగా మారిన వనితకు ఈ సంఘంలో ఎంత గౌరవముంటుందో నాకు బాగా తెలుసు. ఐనా తప్పలేదు."

"ఏం ?" అడిగాడు మధు మళ్ళీ. ఈ మారు అతని ప్రశ్నకు మరింత కోపమొచ్చింది సరోజకి.

"గౌరవంగా బ్రతకడంకోసం నేను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. నా అందానికి విలువగట్టి అనుభవించి మూల్యం చెల్లించాలని కోరుకున్నారే తప్ప మరో పనివ్వడానికి ఎవరి మనసూ అంగీకరించలేదు.

నా అందమే నాకు శతృవైంది.

నా సౌందర్యమే నాకు శాపమైంది.

నా చక్కదనమే నన్నీ స్థితికి దిగజార్చింది.

మగవాడిని ఆకర్షించేందుకు ఆడదాన్ని అందంగా పుట్టించాడా భగవంతుడు. ఐతే ఆ అందంవల్ల ఆమె అధోగతి పాలౌతుందేమోనన్న ఆలోచన అతడికి రాలేదేమో! చంద్రం నేను ఆర్థిక ఇబ్బందులలో వున్నప్పుడు ఎన్ని రోజులు పస్తులున్నామో మాకే తెలియదు. చివరికి నాకు సులువుగా దొరికింది, ఈ సమాజమిచ్చింది ఈ పనే. అప్పుడు మరోమారు ఆలోచించుకున్నాను. నే నెలాగైనా బ్రతకాలి. అదేనా నా కోసంకాదు. తమ్ముడికోసం. తమ్ముణ్ని బ్రతికించుకోడం కోసం. అందుకు ఏదో ఒక పని చేయక తప్పదు. ప్రతి స్త్రీకి శీలం అతి అమూల్యమైంది. దానిని నే నొకమారు పోగొట్టుకున్నాను. అదే తప్పు అనుకుంటే, తప్పు ఒకమారు చేసినా పలుమార్లు చేసినా ఒకటే శిక్ష పడాలిగా. అందుకే తెగించాను. చంద్రం అభివృద్ధి కోసం తెగించి బ్రతుకుతున్నాను" అంటూ లేచి నిలబడింది సరోజ.

"సరోజా!" పిలిచాడు మధు మార్దవంగా. ఆమె వెళ్ళిపోతున్నందుకు బాధ. ఆమె కథంతా విని కనీస సానుభూతైనా చూపలేదనే వ్యథ ఆ పిలుపులో మిళితమై వున్నాయి.

"నా కథ చెప్పడం పూర్తయింది. నన్ను మీరెలా అర్థం చేసుకున్నా ఫరవాలేదు. ఇప్పటికే చాలా టైమయింది. రండి. త్వరగా పంపేయండి"

"సరోజా! నీ చరిత్రంతా విన్నాకా నీమీద సానుభూతి తప్ప మరో వాంఛ కలగటంలేదు. అడగగానే సంకోచించకుండా ఉన్నదున్నట్టు నీ కథ చెప్పినందుకు నేనెంతో కృతజ్ఞుడను. ఎన్నెన్నో ప్రశ్నలేసి విసిగించి వేధించి వుంటాను. అందుకు నన్ను మనస్ఫూర్తిగా క్షమించగలవని అనుకుంటున్నాను."

మధు మాటలకి అమితాశ్చర్య పోయింది సరోజ. తన జీవితగాథ అతడిపై ఎటువంటి ప్రభావము చూపలేదనుకుంది. తన భావన పొరపాటైనందుకు సిగ్గుపడింది.

"మీసానుభూతికి నా కృతజ్ఞతలు. మరి నేనిక వెళ్ళొచ్చా" అడిగింది చారవేసున్న తలుపులను తెరుస్తూ.

"లేదు. నువ్వు వెళ్ళిపోవడానికి వీల్లేదు" అన్నాడు మధు.

"ఐతే ఎంతసేపని మీదగ్గరుండిపోమంటారు" అన్నది సరోజ నవ్వుతూ. ఇప్పుడామె హృదయమెంతో తేలికగా వుంది.

"శాశ్వతంగా"

"అంటే"

"గతి తప్పిన నీ బ్రతుకు మార్గాన్ని మళ్ళిస్తాను. నువ్వంగీకరిస్తే నిన్ను పెళ్ళిచేసుకుంటాను. మీ చంద్రాన్ని రెసిడెన్షియల్ స్కూల్లో ఎడ్మిట్ చెయించి స

## గడుసులోకం — బాబు







ఆశయం నెరవేరుస్తాను. నీ జీవితంలో వసంతాన్ని తెస్తాను."

"నాతో పరిహాసమాడుతున్నారా?"

"కాదు. ఇది పరిహాసం ఎంతమాత్రం కానేకాదు. నా మనసులో మాట".

"వద్దు ఆమాట అనకండి. నేను అపవిత్రురాలను. మిమ్మల్ని అందుకనే అర్హత నాకులేదు. ఇటువంటి పిచ్చి ఆలోచనలతో మీ జీవితం పాడుచేసుకోకండి. నాలాంటి దానిని కట్టుకోవడంవల్ల మీకు సంఘంలో కొత్త సమస్యలు ఉత్పన్నమౌతాయి. మీరు వాటిని తట్టుకోలేరు. మీకంత మనోబల ముంటుందని నేననుకోను. నాకు శలవిప్పించండి" అంది సరోజ అతని నిర్ణయానికి ఆందోళన చెందుతూ.

"నీలో నాకే తప్పు కనిపించడంలేదు. నీ చరిత్ర విన్నాకా నీమీద నాకు అంతులేని ప్రేమాభిమానాలు ఏర్పడ్డాయి. నేను నిన్ను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను. నామాట కాదనకు. రా... నాతో కలిసి ఏడడుగులు ...డవడానికి రా." చేతులు చాపుతూ ఆమెను సమీపించాడు మధు

"ఏమండీ, మీరు మనుషులుకాదు! ఇన్నాళ్ళూ మగవాళ్ళమీద ద్వేషం ...ంచుకుంటూ వచ్చాను. మిమ్మల్ని చూసాకా ఆ భావన పటాపంచలైంది. కృతయుగంలో, త్రేతాయుగంలో అవతార పురుషులు వెలిసారని తెలుసు. ఐతే కలికాలంలో కూడా మీలాంటి అవతార పురుషులున్నారని ఇప్పుడిప్పుడే తెలుసుకొంటున్నాను." ఆనందంలో ఆమె నేత్రాలు అశ్రుపూరితాలయ్యాయి. తనిప్పుడు పొందిన అనుభూతి వాస్తవమా లేక స్వప్నమా? గట్టిగా కళ్ళు ...ులుముకుంది.

"నన్ను దేవుణ్ణిచేసి పైకెక్కించకు" అన్నాడు మధు. ఆమె బుగ్గలపై జారిన కన్నీటి చారలను సున్నితంగా తుడుస్తూ.

"కాదు. మీరు మనుషులుకాదు. ఈ లోకంలో మగవాళ్ళంతా మీలా ...లోచించగలిగితే ఈ దేశంలో ఏ ఆడదానికి నాలాంటి అధోగతి పట్టదు" అంది ...రోజ.

వెంటనే ఆమెను దగ్గరకు తీసుకుని గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు ...ధు.

అంతలో వామనరావు ఆగమనంతో వారిరువురూ కాస్త దూరమయ్యారు.

"సరోజా! నిన్ను మొదటినుండి అపార్థం చేసుకుని అవమానించాను. నీ ...రిత్ర మధుకి చెప్తూవుంటే ప్రక్కనుండి విన్నాను. మచ్చలేని మగువకు ...చ్చునాపాదించడానికి మేమెన్నో విధాల ప్రయత్నించాం. కాని ఏర్పడ్డ మచ్చని ...యం ...యడానికి మా మధు ముందుకొచ్చాడు. దేవుడంటే ఎవరోకాదని ...నుషులలోనే వుంటాడని ఋజువు చేసాడు. నేను నీ పట్ల ప్రవర్తించిన ...ప్పిదానికి నన్ను మనస్ఫూర్తిగా మన్నించగలవా?" దేవతను ...డుకుంటున్నట్లుగా వున్నాయి అతడి మాటలు.

వామనరావులో కలిగిన పరివర్తనకు చకితురాలైపోయింది సరోజ.

"వాస్తవాన్ని గ్రహించి పశ్చాత్తాపపడ్డావు. అదేచాలు. మనిషికి పశ్చాత్తాపానికి మించిన శిక్ష మరొకటి ఉండదు నీ మనసు ఇప్పటికైనా మారి నామీద సద్భావం కలిగినందుకు నేనెంతో కృతజ్ఞురాలని."

"మీరిరువురూ ఆదర్శ దంపతులై చిలకా గోరింకల్లా వుంటూ చిరకాలం జీవించాలని మనసారా కోరుకొంటున్నాను మధూ! శలవిప్పిస్తే మరి నేను వెళతాను." అన్నాడు వామనరావు అతని చేతులు పట్టుకుని.

"నువ్వొక్కడివి ఎక్కడికి వెళతావురా. రేపు అందరం కలిసే వెళ్ళిపోదాము" అన్నాడు మధు.

"లేదు నేను వెళ్లాలి. మీరిరువురూ హనీమూన్‌కి వెళ్ళిరండి" అన్నాడు వామనరావు.

"సార్, ఐస్‌క్రీమ్" లోపల కొచ్చాడు బోయ్.

"వాళ్ళ కిప్పుడు కావలసింది ఐస్‌క్రీం కాదోయ్" అన్నాడు వామనరావు.

ప్రశ్నార్థకంగా ముఖంపెట్టాడు బోయ్ కొంత ఆశ్చర్యాన్ని కూడా జోడిస్తూ.

"వెంటనే పూలమాలలు పట్టుకురా. మార్చుకుంటారు" అన్నాడు వామనరావు.

"అవి ఎప్పుడో సిద్ధం చేసాను సార్" అని బయటకు వెళ్ళి రెండు పొడవైన గులాబీ పూల దండలు పట్టుకొచ్చాడు.

"మా కిప్పుడు కావలసింది పూలమాలలని నువ్వెలా గ్రహించావు" తన అనుమానం నివృత్తి చేసుకునేందుకు అడిగాడు మధు.

"నాకా మాత్రం తెలియదా సార్? మీ కామెపై అటువంటి వుద్దేశమే లేకపోతే ఇన్ని గంటలిలా మాట్లాడుతూ కూర్చోరు" అన్నాడు బోయ్.

వాడి తెలివికి ఆశ్చర్యపోతూ నవ్వుకున్నారు వామనరావు, మధు, సరోజ.

(అయిపోయింది)

## అంకితం

ఏ స్త్రీ కావాలని కాల్‌గర్ల్‌గా మారదు. ఏ వనితా కోరుండి వ్యభిచారంలోకి దిగదు. అపరిష్కృతమైన సమస్యల వలయంలో చిక్కుకుని, దిక్కు తోచక, బ్రతకడానికి మరోమార్గం కానరానప్పుడు, వళ్ళు అమ్ముకోడానికి సిద్ధపడుతుంది ఆడది. అటువంటి అభాగినులెందరో ఈ లోకంలో వున్నారు. వాళ్ళకి ఈ నవల సానుభూతితో అంకితం.

–రచయిత




**డాక్టర్ కె. వెంకటేశ్వరరావు**

ఎం.జె.ఎం. – [illegible]

నా వయస్సు [illegible] సం. [illegible] ఎల్లలు. గత సం. నుంచి శరీరం బరువు తగ్గిపోతున్నది. [illegible] వచ్చినా నామ మాత్రమే! జీర్ణశక్తి [illegible] అవుతున్నది. డాక్టర్లు ఎక్సరే తీసి ఏమీ లేదన్నారు.

**లేడి డాక్టర్లు [illegible] పరీక్షించి రోగ నిర్ధారణ చెయ్యవలసి [illegible] వెంటనే వారిని కలవండి.**

డి.పి. – భువనేశ్వర్

నాకు [illegible] విపరీతంగా తల నెప్పి వస్తుంది. కారణం తెలుపగలరా?

**[illegible] చూపలేక పోవటమే దీనికి కారణం అ[illegible] ఉం[illegible] వైద్యుల సలహా పొందటం మంచిది.**

[illegible]

మనిషి [illegible] కారణం ఏమిటి? దీనిని బాగు చేసి తిరిగి మాట్లాడ [illegible] ఉందా? దీనిని బాగు చేయడానికి అసలు అవకాశం ఉం[illegible]

**పుట్టు[illegible] కొన్ని రోగాలు, మెదడు ముందు భా[illegible] రక్త సరఫరా తగ్గటం అనేవి ముఖ్య కారణాలు. పుట్టుకతో ఏర్పడితే [illegible] చికిత్స కష్టం. రక్త సరఫరా తగ్గి మాట పడిపోతే చికిత్సవల్ల పరిస్థితి మెరుగుపడే అవకాశం ఉంటుంది.**

జి.డి. – హైదరాబాదు

నావయస్సు 24 సం లు ఈ మధ్య ఒక అమ్మాయితో పరిచయం అయ్యింది. ఆ అమ్మాయితో వరుసగా నాలుగు రోజులు రతిలో పాల్గొన్నాను. నా అంగం ముందు చర్మం పగిలి పోయింది రెండు మూడు రోజులకి తగ్గింది. ఒకసారి మళ్ళీ కలిసాము. ఆ రోజు ఇంకా బాగా పగిలి పోయింది. రతిలో పాల్గొనలేక పోయాను. రక్తం కూడా పోయింది. రెండు రోజులవరకు నెప్పి తగ్గలేదు

**మీరు శస్త్ర చికిత్స చేసే డాక్టర్ల దగ్గరకి వెళ్ళి సర్కమ్‌సిషన్ చేయించుకోవటం ఉత్తమం!**

వై.ఎల్.ఎన్. – గుడివాడ

మన మాజీ ప్రధాని శ్రీ మొరార్జీ దేశాయ్‌గారు ప్రతి రోజు ఉదయమే మూత్రం త్రాగుతారని విన్నాను. యూరిన్ త్రాగాలంటే దానిని శుభ్రం చెయ్యాలా లేదా దానికి ఏమైనా కలిపి తాగాలా. ఎలా శుభ్రం చెయ్యాలి? ఏమి కలపాలి?

**మీరు వారినే ప్రత్యక్షంగా అడగటం ఉత్తమం. నాకు ఈ విషయంలో ఏ మాత్రమూ అనుభవం లేదు.**

పి.ఎస్.ఆర్. – రాజమండ్రి

ప్రతి శీతాకాలంలో ను కాలిమీద, తొడలమీద ఎర్రటి చీమ పొక్కులు లాగా వస్తాయి విపరీతమైన దురదగా ఉంటుంది. ఏ రకమైన చర్మ వ్యాధులు లేవు. కొంత కాలానికి వాటంతట అవే పోతాయి. నా వయస్సు 23 సం.లు

**ఆ పొక్కుల నుంచి కారే "రసి"ని తీసి ప్రత్యేకంగా వాక్సిన్ తయారు చేయించి వైద్యుల పర్యవేక్షణలో ఇంజక్షన్ రూపంలో వేయించుకో వలసి ఉంటుంది.** □



# దొరికితే దొంగలు

గురజాడ శోభాపేరిందేవి

పని మనిషి వెళ్ళిన అరగంట దాకా తను తన వాచీని బాత్రూమ్‌లో మరచిపోయిన విషయం గుర్తు రాలేదు వందనకి!

అదైనా చాలా చిత్రంగా గుర్తొచ్చింది.

పనిమనిషి బట్టలుతికి, అంట్లుతోమి వెళ్ళిపోయింది. ఇంక వందనకి కావలసినంత తీరిక!

అందుకే హాయిగా ఓ వారపత్రిక అందుకుంది

అందుకుందంటే అంతా ఐతేకానీ వదలదు. ఈ రోజూ అలాగే పుస్తకం అందుకుని పక్కమీద వాలింది.

పుస్తకం అంతా అరగంటలో కానిచ్చేసింది.

ఇంక ఏం చెయ్యాలో ఆమెకి అర్థం కాలేదు ఇంకా చదివేందు కేమైనా మిగిలిందేమోనని ఆశగా మళ్ళీ పుస్తకమంతా ఒక్కొ పేజీ తిప్పసాగింది.

ఆమె దృష్టి ఆల్విన్ వాచీల అడ్వర్‌టైజ్‌మెంట్‌మీద పడింది.

"ఎంత బాగున్నాయో!" అనుకుంది పరిశీలనగా చూసి!

అప్పుడే హఠాత్తుగా ఆమెకి తన హెచ్. ఎమ్. టి. వాచీ బాత్రూమ్‌లో ఉన్నట్టు గుర్తొచ్చింది

భర్త, పిల్లలూ వెళ్ళిపోయాక బాత్రూమ్‌కి వెళ్ళింది వందన!

టైల్స్ అన్నీ మట్టి పట్టి అసహ్యంగా కనిపించాయి. కడిగితే సరి అనుకుంది.

అప్పుడు చేతికి వాచీ కనిపించింది దాన్ని తీసి గూట్లో ఉంచింది.

ఆమెకి వాచీ పెట్టుకోకపోతే తోచదు. రాత్రి నిద్రపోతున్నా అది చేతిన ఉండవలసిందే!

దాన్ని తీయడం మరచిపోయి చాలాసార్లు స్నానం చేసింది కూడా!

అలాంటప్పుడు తల్లి తిట్టేది 'తీసేసి స్నానం చేయరాదుటే" అని!

అప్పుడు వందన తను తీయడం మరచిపోయిందన్న మాటని పక్కన ఉంచి, "ఇది వాటర్‌ప్రూఫ్ అమ్మా! నీళ్ళలో తడిసినా ఏం కాదు" అనేసేది అదంతా పెళ్ళికాక ముందు కథ!

ఇవాళ కూడా అలాగే చేతికే ఉంది.

కానీ యాసిడ్స్‌తో టైల్స్ కడుగుతోందాయె!" పాడైపోతేనో!"

ఆ భయంతోనే గబగబా తీసి గూట్లో ఉంచిందన్నమాట!

ఇప్పుడది గుర్తొచ్చింది

తీద్దామని బాత్రూమ్ కెళ్ళి చూసింది

లేదు!

ఆమెకి గుండె వేగంగా కొట్టుకో నారంభించింది. ఏమైందో!

తను ఇక్కడేగా పెట్టింది!

ఇంకేమవుతుంది పనిమనిషి కొట్టేసి ఉంటుంది అంది మనసు.

వెంటనే పని మనిషిని గురించి ఆలోచించసాగింది.

అది నాలుగైదిళ్ళల్లో పాచి పని చేసి సంపాదిస్తున్నమాట నిజమే!

కాని దాని మొగుడు తాగుబోతు!

తను కూలీ పని ద్వారా సంపాదించినది, శుభ్రంగా తాగుతాడు



ఇదే తన డబ్బుతో సంసారం నడుపుతూ ఉంటుంది

కాని దాన్ని కూడా కొట్టి లాక్కుంటూ ఉంటాడు వాడు!

అందుకే అది వందనతో అంటూ ఉంటుంది." 'నాలుగు రూపాయలు చేతిలో నిలిచే మార్గమె కనిపించడం లేదు" అని!

అది కడుపుతున్న మనిషి!

దానికి ఏవేవో తినాలని కోరిక!

కనక ఇది దాని పనే అయి ఉంటుంది.

అది తీసింది సరే!

కానీ తనకి లభించే దెలాగ?

అసలది తన చేతికి వస్తుందా?

లేకపోతే కుదువ పెట్టేసి ఉంటుందా? గబగబా చెప్పు లేసుకుంది.

బయటికి వచ్చింది.

తలుపు గొళ్ళెం పెట్టింది.

ఇరుగమ్మకి ఇది సంగతి అంటూ తెలియ జేసింది.

ఇరుగమ్మ పొరుగమ్మకి చెప్పింది.

అయిదు నిముషాల్లో అమ్మలక్క లంతా ఆ వరండాలో చేరారు!

ఇది పని మనిషి పనే అని తీర్మానించారు.

తమ తమ ఇళ్లల్లో,

తము ఎరుగున్న వాళ్ళ ఇళ్ళల్లో పని మనుష్యులు ఎలాంటి దొంగతనాలు చేసారో చర్చించారు.

పనిమనిషి ఇంటికి కూడా వెళ్ళాలనే ఉంది అందరికి!

కాని ఎవ్వరికి దానిల్లు ఎక్కడ ఉందో తెలియదు.

వాళ్ళ మాట లింకా సాగుతూనే ఉన్నాయి. "అమ్మా!' పిలిచింది వందన కూతురు అప్పుడే బడి నుండి వచ్చిందా పాప

"... ... ..."

"అమ్మా నిన్నే!" మరోసారి పిలిచిందా పాప!

పలికిందిసారి వందన.

"నా కాకలేస్తోందమ్మా!" అంది

"వస్తున్నాను" అని కూతురితో అని 'మరేం చెయ్యనండి!" అని అడిగింది అందర్ని ఉద్దేశించి!

"మి వారిని రానివ్వండి. అప్పుడు పోలీసు రిపోర్ట్ ఇవ్వండి!" అన్నారు.

'సరే' అనేసి లోపలికి నడిచిందామె!

'ఏం జరిగిందమ్మా?" అడిగింది బళ్లో చదివే కూతురు!

గబగబా చెప్పింది వందన.

"అమ్మా మరే!"

"ఊ!"

"అది దొంగెలా అవుతుంది?'

"ఎందుకు కాదే నీ ముఖం!"

"దొంగతనం చేస్తేనే దొంగకాని దొరికనది తీసుకుంటే దొంగ కాదని నువ్వు చెప్పావు గుర్తుందా?" "నేనెప్పుడు చెప్పాను?"

మనిద్దరం ఓసారి ఇందిరా పార్కుకి వెళ్లాం! అప్పుడు పార్కులో నేను వేరే పిల్లల్తో కలిసి చాలాసేపు పరిగెత్తి ఆడాను కూడా!

"ఆ తర్వాత ఇద్దరం పార్కు బయటికి వచ్చాం! అక్కడ నీకు యాభై రూపాయల నోటు దొరికింది వెంటనే బ్యాగ్‌లో పెట్టేసావు.

కొంచెం దూరమైనా వెళ్లక ముందే నేను నీకు చెప్పాను. వెనకెవరో రోడ్డంతా వంగో వంగి వెతుకుతున్నారు నువ్వు తీసిన డబ్బు వాళ్ళదేలా ఉంది అని.

కాని నువ్వు నాతో ఇంకేమి మాట్లాడలేదు.నా చెయ్యి పట్టి బరబరా లాక్కుపోయావు.

"మరి మరి అలా చూస్తే పని మనిషి కూడా దొంగ కాదమ్మా!

వందన బిత్తరపోయింది. కూతురి మాట తీరుకి!

ఆమెకి చాలా సగ్గుగా కూడా అనిపించింది. అలా పట్టుపడినందుకు! అందుకే ఇంకా ప్రసక్తి ఎత్తలేను.

భర్త ఆఫీసు నుండి వచ్చినా వందన పెదవి విప్పలేదు

కూతురే చెప్పింది.

"రేపు దాన్ని అడిగాక చూద్దాంలే!" అన్నాడతను అలసటగా కుర్చీలో వాలి!

బాగా రాత్రైంది.

భోజనాలయ్యాయి.

తలుపు బాదారెవరో!

తలుపు తీసింది వందన.

ఆమె భర్తా, బిడ్డాకూడా అటొచ్చారు

పనిమనిషి నిలబడుంది




జ్ఞాన సంపాదనకు అవధి అనేది ఉండదు. బుద్ధిమంతులు తమకు కలిగిన జ్ఞానంతో తృప్తి పడక, ఇంకా దానిని సంపాధించడానికే ప్రయత్నిస్తూ ఉంటారు. విజ్ఞానవేత్తలు తమ ప్రతిభ వల్ల నూతనాంశాలను కనుగొన్నా తృప్తి చెందక· ఇంకా అద్భుత విషయాలు అనేకంగా కనిపెట్టడానికే ప్రయత్నిస్తారు. భాషల విషయంలో కూడా ఇదే పద్ధతి.

మన భారత దేశం వివిధ సంస్కృతులకూ, వివిధ భాషలకూ నిలయ మైనది. హిందీ, మరాటీ,గుజరాతీ, బీహారీ, బెంగాలీ, ఒరియా, తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం మున్నగు భాషలు వ్యవహారంలో ఉన్నవి. ఆ యా ప్రాంతాలవారు తమ తమ మాతృ భాషను ఉగ్గు పాలతో నేర్చుకుంటారు. ఇది సహజం. వారు కేవలం తమ భాషనే నేర్చుకొని, యితర భాషలు నేర్చుకోకపోతే చిక్కులు కలుగుతాయి. ఏమంటే, వారు కూపస్థమండూకాల వలె తమ దేశంలో నే ఉండరు గదా! ఇతర ప్రాంతాలకు వెళ్లినప్పుడు, అక్కడ భాష రాకపోతే పడే శ్రమ అనుభవజ్ఞులకే తెలుస్తుంది. అందువల్ల ఇతర భాషలను నేర్చుకోవడం కూడా ఎంతో అవసరం.

ఇతర ప్రాంతాల వారిని మనం స్నేహభావంతో చూడాలి. వారితో విరోధం తగదు. ఆ రీతినే ఇతర భాషలపై ద్వేషం పెట్టుకోవడం కూడా తగదు.

సాధారణ జ్ఞానం వలె భాషా జ్ఞానానికి గూడా పరిమితి లేదు. ఎన్ని భాషలయినా నేర్చుకో వచ్చును. ఆ యా రాష్ట్రాల సరిహద్దు ప్రాంతాలలో ఉన్న వారికి అప్రయత్నంగా రెండు భాషలూ వస్తాయి. దక్షిణ ప్రాంతం తెలుగు వారికి తమిళం, కర్ణాటక సరిహద్దులలో ఉన్నవారికి తెలుగుతో పాటు కన్నడం, ఉత్తరాంధ్రం సరిహద్దు వారికి ఒరియా సులభంగానే వస్తాయి. బహు భాషాభిజ్ఞత్యం దేశైక్యతకు తోడ్పడుతుంది. సంకుచితభావాలు దూరమై పోతాయి. సుప్రసిద్ధులైన విద్వాంసులు, దేశ నాయకులు రెండూ, మూడూ కాదు. ఎన్నో భాషలు ఎరిగి ఉన్న సంగతి మనకు తెలియనిది కాదు. ఇతర భాషలలో ఆసక్తి లేక, సంకుచిత భావాలు ఉన్నప్పుడే భాషా సమస్యలు తల లెత్తుతాయి. పరస్పర విరోధాలకు దారి తీస్తాయి. వాట వల్ల ఎన్నో అనర్థాలు ఏర్పడతాయి. ఈ భాషా సమస్య తీరడానికి ఇతర భాషలు కూడా రావడం ఎంతో అవసరం.

– బులుసు వేంకట రమణయ్య

ఆమె చేతిలో వాచి!

ముగ్గురి ముఖాలూ తళుక్కుమన్నాయి.

ఆమె ఆయాస పడ్తోంది! చెమటల్తో తడిసి ఉంది అయినా చెప్పింది "ఇదిగోనమ్మా! నాతోపాటు పనికొచ్చిన నా కొడుకు దిన్ని తీసుకు వచ్చాడుట'

ఆ సంగతి నాకు ఇందాకే తెలిసి వుంటే ఎప్పుడో తెచ్చి ఇచ్చేదాన్ని

ఇప్పుడిప్పుడే నా మొగుడు ఇంటికి వచ్చాడు.

బాగానే తాగి ఉన్నాడు.

కాని నన్ను డబ్బడిగాడు.

ఇంకా తాగాలనే అని నాకు తెలుసు

లేదన్నాను నిజంగా కూడా నా దగ్గర లేదు.

కాని ఊరుకోలేదు.

ఇష్టం వచ్చినట్లు బాదసాగాడు నన్ను!

నా తల బొప్పి కట్టింది.

గాజులు చిట్లాయి

ఇంతలో నా కొడుకు ఉన్నట్టుండి అరిచాడు.

"నాన్నా! అమ్మనింక కొట్టకు! ఇదిగో ఈ వాచి తీసుకుపో! ఇందాకా పని చేసిన వాళ్లింట్లో దొరికితే తెచ్చాను' అన్నాడు.

నాకు వెంటనే విషయం అర్థమైపోయింది.

అవును మరి ఇందాకా బాత్రూమ్‌లో నేనూ దాన్ని చూసినదాన్నే!

అందుకే గబుక్కున వాడి చేతుల్లోంచి వాచి లాక్కున్నాను.

పరుగుపెట్టాను

ట్రాఫిక్‌ని, కాని నా ఒళ్లు నెప్పులని కాని, వెంటాడుతున్న మొగుడ్ని కానీ పట్టించుకోలేదు.

నా కోరిక ఒక్కటే నాకు చెందని ఈ వస్తువు నా దగ్గర ఉండడానికి వీల్లేదు! అలా నేను ఉండనివ్వను

నా బిడ్డని దొంగగా మార్చలేను నేను.

వాడికి అది తప్పని తర్వాత చెప్తాను.

నా వెనక వస్తున్న నా భర్త నేనిది ఇచ్చేసానన్న కోపంతో నన్ను చంపినా సరే!

నా నీతిని మాత్రం నేను చావనివ్వను"

చిరిగిన బట్టలు చెమటలకి ఒంటికి అతుక్కున్నాయి.

జుట్టు రేగి ఉంది ముఖమంతా గాట్లు, కమిలిన గుర్తులూ!

కానీ ఆ మాటల్లో ఎంత నిజాయితీ!

"ఎందరో దొంగలున్నారు. ఈ దరిద్ర ప్రపంచంలో! కాని దొరికిందాకా అంతా దొరలే!" అంది వందన ఓసారి కూతురితో!

కాని ఇప్పుడు జరిగినదేమిటి, ఆలోచిస్తోంది అలాగే నిలబడి వందన

(ఈ కలికాలంలో న్యాయం, నీతి, నిద్రలు పోతున్న మాట నిజమే!

కానీ అవి నిర్జీవం కాకుండా నిలుపుతున్నది కేవలం ఇలాంటి కొందరు వ్యక్తులే!) □

# హైదరాబాదు నోట్‌బుక్

## జర్మనీలో శ్రీ పి. టి. రెడ్డి చిత్ర శిల్ప ప్రదర్శనలు :–

నా యూరోప్ యాత్ర కేవలం చిత్రకళా ప్రదర్శన శాలలకు సంబంధించింది. అక్కడి నానా విధమైన కళాకేంద్రాలను దర్శించినప్పుడు, అక్కడి కళారీతులు నా దృష్టి వికాసానికి ఎంతో చేయూత నిచ్చాయి. భవిష్యత్తులో నేను అనుసరించబోయే విధానానికి మార్గం లభించింది. నేను స్థాపించబోయే ఆర్ట్ మ్యూజియాన్ని మనదేశ పరిస్థితులకు అనుగుణంగా తీర్చి దిద్దుకోడానికి మార్గదర్శక సూత్రాలు దొరికాయి – అని అన్నారు విఖ్యాత కళాకారులు శ్రీ పి. టి. రెడ్డి.

నేషనల్ గ్యాలరీ ఆఫ్ మాడర్న్ ఆర్ట్ సంస్థ 1982 – 83 లో జర్మనీలో ప్రదర్శించడం కోసం తంత్ర శాస్త్రానికి సంబంధించిన చిత్ర శిల్పాల సంకలనం సిద్ధపరచింది. ఆ సంకలన పెక్కు చోట్ల ప్రదర్శితమైంది. తర్వాత "పార్టీ ఇయర్స్ ఆఫ్ పి. టి. రెడ్డి" అనే చిత్రసంకలన గ్రంథాన్ని మ్యూన్స్టర్ విశ్వవిద్యాలయాచార్యుడు డాక్టర్ రొడాల్ఫ్ కొన్నారు. ఆయన 1984 లోను, 1985 లోను భారతదేశానికి వచ్చినప్పుడు పదమూడు రోజులు హైదరాబాదులో ఉండి శ్రీ పి. టి. రెడ్డి చిత్ర శిల్పాలు దాదాపు పది వేలను పరిశీలించారు, ఆరు కళాఖండాలను కొన్నారు. ఆయన జర్మనీకి వెళ్ళిన తర్వాత ఇండో – జర్మన్ మైత్రి సంఘం ద్వారా జర్మనీలో శ్రీ పి. టి. రెడ్డి చిత్ర శిల్ప ప్రదర్శనాన్ని ఏర్పాటు చేశారు. భారత ప్రభుత్వం సాంస్కృతిక సంబంధాల మండలి (ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్) శ్రీ పి. టి. రెడ్డి ప్రయాణ వ్యయం భరించింది. ఈ ప్రదర్శనం పశ్చిమజర్మనీలో పెక్కు చోట్ల జరిగింది. మే 13 వ తేదీన మ్యూన్స్టర్‌లో ప్రారంభమయింది. ఇది జూన్ 7 వరకు మ్యూన్స్టర్‌లో జరిగింది. జూన్ 12 నుంచి 22 వరకు ఎస్సెన్‌లో జరిగింది. జులై 19న బాన్‌లోను, పిదప ఫ్రాంక్‌ఫర్ట్‌లోను జరుగుతుంది. ప్రదర్శనంలో 44 తైలవర్ణ చిత్రాలు, 12 శిల్పాలు, 36 తంత్రానికి సంబంధించిన నీటి రంగు చిత్రాలు, 50 డ్రాయింగులు, 35 గ్రాఫిక్కులు ఉన్నాయి. మ్యూన్స్టర్ విశ్వవిద్యాలయ పట్టణం. ఇక్కడి వాల్క్‌షోలే సంస్థలో ఈ ప్రదర్శనం ప్రారంభమైంది. సంస్థ డైరెక్టర్ డాక్టర్ ఫెడరిక్ కార్ల్ స్కొషరోన్‌హాఫ్ అధ్యక్షత వహించి ప్రారంభోత్సవం జరిపారు. బాన్‌లోని భారత రాయబారి కార్యాలయం ప్రథమకార్యదర్శి డాక్టర్ బి. ఎన్. శర్మ భారత జర్మనీ కళాసంబంధాలు వివరించి జర్మనీలో భారత కళాకారుడు శ్రీ హెబ్బార్ తొలిసారిగా కళాప్రదర్శనం జరిపారని, రెండవ కళా ప్రదర్శనం శ్రీ పి. టి. రెడ్డిదని అన్నారు. బాన్‌లోని ఇండియన్ కల్చరల్ సెంటర్ డైరెక్టర్ శ్రీమతి ఉషామల్లిక్ శ్రీ పి. టి. రెడ్డిని పరిచయం చేశారు. కళా విమర్శకురాలు, పత్రికా రచయిత్రి శ్రీమతి ఎడ్నా భట్టాచార్జీ శ్రీ పి. టి. రెడ్డి చిత్రాలను గురించి 40 నిమిషాలు ప్రసంగించారు. ఇండో – జర్మన్ మైత్రీ సంఘం అధ్యక్షుడు డాక్టర్ రొడాల్ఫ్ (మూన్స్టర్ విశ్వవిద్యాలయాచార్యులు) ధన్యవాదాలు సమర్పించారు. శ్రీ రెడ్డి తమ కళను గురించి, తర్వాత జరిగిన పురప్రముఖుల సమావేశంలో వివరించారు. పిదప ప్రత్యేకమైన టి. వి. ఇంటర్వ్యూలోను, రేడియో ఇంటర్వ్యూలోను శ్రీ రెడ్డి తమ చిత్ర శిల్పాలను గురించి, తమ దృక్పథాన్ని గురించి చెప్పారు. ఆగస్టులో ఈ ప్రదర్శనం అమెరికా, కెనడాలోను, యూరోప్ అంతటాను దూరదర్శనంలో ప్రసారమవుతుంది. మన చిత్రాలపై పాశ్చాత్యుల ప్రభావం వుందని అక్కడి వారు కొందరన్నారు. కాని, నేను భారతదేశంలో అతిప్రాచీనమైన అజంతా చిత్రాలు, మొనియేచర్ల ప్రభావమే కొనసాగుతున్నదని, సాంకేతిక పరిజ్ఞానంలో భారతీయులు విదేశీయులకు ఏ మాత్రం తీసిపోరని, భారత లలితకళలు దేశీయ ముద్రతో విశిష్టమైనవని వాదించాను – అన్నారు శ్రీ రెడ్డి. భారతీయులు యూరోప్ నుంచి, ముఖ్యంగా జర్మనీ నుంచి నేర్చుకోవలసింది చాల ఉందని, శ్రీ రెడ్డి వెంట పర్యటించి వచ్చిన ఆయన సతీమణి డాక్టర్ యశోదారెడ్డి అన్నారు. ఈమె ఉస్మానియా విశ్వ విద్యాలయంలో తెనుగు శాఖ ప్రొఫెసర్. మ్యూన్స్టర్ నగరం విశ్వ విద్యాలయ నగరం. 45 వేల మంది విద్యార్థులున్నారు. ఈ విశ్వవిద్యాలయం క్రమశిక్షణకు పెట్టింది పేరు. విద్యార్థులకు మధ్యాహ్న భోజన సౌకర్యం ఉంది. చదువు వ్యయసాధ్యం కాదు. విద్యార్థులు ఏకోర్సయినా తీసుకోవచ్చు. వారు చదువుకొంటూ పనులు చేసే అవకాశంవుంది. కాని, మంచి మార్కులు తెచ్చుకోవాలనే ధ్యేయం కలవారికి మరొక చోట పని చేయడం సాధ్యం కాదు. పన్నెండు గంటలు చదువవలసివుంటుంది. పిల్లలు ఆరేళ్ళ వరకు బడికి పోనక్కరలేదు. ఆరేళ్ళు కాగానే, ఎందుకు బడిలో పిల్లలను చేర్పలేదని పోలీసు శాఖనుంచి కార్డు వస్తుంది. ఆరేళ్ళ నుంచి కాలేజీ వరకు చదువు ఉచితం. దమ్మిడీ కట్టాల్సిన పనిలేదు. కాని ఆరేళ్ళలోపు చదువు చాల వ్యయభరితం. 16 సంవత్సరాల వయస్సు వచ్చే వరకు వారు మనపిల్లలకంటె మూడింతలు ఎక్కువ చదువు నేర్చుకుంటారు. విద్యార్థులకు మానసిక శారీరక పరిశ్రమలు చాల ఉన్నాయి. అంతా క్రమశిక్షణతో జరుగుతుంది. విశ్వవిద్యాలయంలో పచ్చిక టిళ్ళు పట్టుతివాచీలు పరచినట్టుంటాయి. చెత్తచెదారం వుండదు. విద్యార్థుల సమ్మెలు అసలులేవు. జర్మనీ కామన్ మార్కెటులో చేరడం వల్ల ఆహారపదార్థాల ధర పెరిగింది. అప్పుడు విద్యార్థులు తమ కిచ్చే స్టైపెండ్స్ చాలక సమ్మె చేశారు. తరగతుల తర్వాత, ఎలాటి నినాదాలు లేక, మౌనంగా బ్యానర్లతో ఐదుమైళ్ళు ప్రదర్శనం జరిపారు. వారి కోరికలు న్యాయమైనవని ఉపాధ్యాయులు కూడ సమర్థించారు. విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షపదవికి ప్రొఫెసర్లనే నియమిస్తారు. ఈ నియామకం పర్యాయ పద్ధతిలో వుంటుంది. సీనియర్ ప్రొఫెసర్ సహజంగా ఉపాధ్యక్షుడవుతాడు. ప్రొఫెసర్ కావడం చాల ప్రతిష్ఠాకరంగా భావిస్తారు. ప్రొఫెసర్ ఉద్యోగం సెలెక్షనుకు 21 మంది ఉంటారు. సెలెక్షన్ ఆరు

పశ్చిమ జర్మనీలోని మ్యూన్ స్టర్ నగరంలో శ్రీ పి. టి. రెడ్డి చిత్ర శిల్పకళా ప్రదర్శనం ప్రారంభోత్సవ దృశ్యం.



## ఇన్నోవేషన్స్‌లో

## VIP సూట్‌కేస్ కొనండి!

బ్రీఫ్‌కేస్ ఉచితంగా పొందండి!

13 శాతం ఆదా చేయండి!

manju.

విజయవాడ షోరూమ్స్ : * ఏలూరు రోడ్, ఫోన్ . 77117

* చల్లపల్లి బంగళా, ఫోన్ : 64024

* వన్‌టౌన్ హెడ్‌పోస్టాఫీసు ఎదురుగా ఫోన్ : 75119

గుంటూరు : బ్రాడీపేట, మెయిన్ రోడ్ ఫోన్ : 22107

విశాఖపట్టణం : T S R కాంప్లెక్స్, స్టేషన్‌రోడ్, ఫోన్.61898

విజయనగరం , బాలాజీ కాంప్లెక్స్, M G రోడ్.

హైదరాబాద్ : * రిట్జ్ హోటల్ రోడ్, ఫోన్ . 233655

* పోస్టాఫీసు ఎదురుగా, చిక్కడపల్లి

* గ్రామర్ స్కూల్ ఎదురుగా అబిడ్స్.

## తెల్ల మచ్చలకు చికిత్స

తీవ్రమైన ఒక పరిశోధన తరువాత తెల్ల మచ్చలను బాగు చేసేందుకు గాను మా మందు కనిపెట్టబడింది చికిత్సను నియమిక పూర్తిగా పొందుతే మచ్చల రంగు మారి శరీరానికి మునుపటి రంగు తిరిగి వస్తుంది జబ్బు మొదళ్ళలో నుండి కూడా పూర్తిగా నయమౌతుంది మీరు నిరాశ చెందినట్లయితే తప్పకుండా ఈ చికిత్సను పొందండి మా చికిత్సను పూర్తిగా పొందినట్లయితే ప్రచారానికై ఒక ఫైల్ ఉచితంగా ఇవ్వబడుతుంది రోగుల వయస్సుతో సహా జబ్బు పూర్తి వివరాలను వ్రాయండి

## దాంపత్య జీవితాన్ని ఆనందించండి

బాల్యంలో చేసిన పొరపాట్లకు లేక మరి ఏ ఇతర కారణాలకు గాని లోవై సిగ్గుతో మీ బలహీనతను ప్రదర్శించలేక దాంపత్య జీవితంలో ఎటువంటి ఆనందభరితమైన సుఖాన్ని అనుభవించ లేక పోతున్నారా అయితే రహస్యమైన మీ జబ్బు యొక్క పూర్తి వివరాలను వ్రాయండి దాంపత్య జీవితంలో గల నిజమైన సుఖాన్ని అనుభవించేందుకు సలహాలను పొందండి

## తెల్ల వెంట్రుకలు మరియు వెంట్రుకలు రాలిపోవుట

రంగు వేయవలసిన అవసరం లేదు మా ఆయుర్వేద చికిత్స (ఆయిల్) వల్ల తెల్ల వెంట్రుకలు మూలం నుండి నల్లని రంగులోనికి మారి స్థిరంగా నిలుస్తాయి జుట్టు రాలిపోకుండా కాపాడి రాలిన ప్రదేశాన కొత్త జుట్టు వస్తుంది ఇది మెడికల్ పరీక్షించింది ఒక కోర్సులో సెల్స్ ధర రూ 35/- పోస్టేజి మరియు ప్యాకింగ్ అదనం

**SHYAM AYURVED BHAVAN (AP)**
***P.O. KATRI SARAI (GAYA) PIN : 805 105***

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక, దినపత్రిక, పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

## ఇంటర్ విద్యార్థులారా!

1957 లో స్థాపించిన

## రవి కళాశాల

[బ్రాడీపేట, గుంటూరు]

ఎన్నో వేలమంది ఇంజనీర్లను, డాక్టర్లను తయారుచేసి ఆంధ్రుల అభిమానం చూరగొన్న సంస్థ. ఇపుడు ఇంటర్, Bi.P. M.P. గ్రూపులతో చదివే వారి కోసం

## రవి పోస్టల్ ట్యూషన్

ఆగస్టు నుండి ప్రారంభిస్తోంది

ట్యూషన్స్, గైడ్సు అవసరం లేకుండా ఇంటర్ పరీక్షలలోనే గాక ఎంట్రన్సు పరీక్షలలో కూడా నెగ్గటానికి ఎంతో ఉపయోగపడుతుంది. వివరాలకు రు. 5/-లు పంపండి.

సి. వి. ఎన్. ధన్,
డైరక్టర్.

నెలల పాటు జరుగుతుంది వోటు వేస్తారు రికార్డు చూస్తారు శీలానికి ఎక్కువ ప్రాధాన్యముంటుంది మన గురుకులాలలో లాగ ఆచార్యుని విద్యార్థులు చాల గౌరవిస్తారు ఆచార్యుడు రాగానే లేచి నిలబడి గౌరవిస్తారు ఇది విశిష్ట విషయం బస్సులలో టికెట్లు కొనే పద్ధతిలేదు బస్ స్టేజిలలోనే టికెట్లు కొనాలి సబ్ వేలలో టికెట్లు మిద టైము కూడ వుంటుంది గనుక మోసానికి ఆస్కారం వుండదు టాక్సిలు మోసం చెయకుండా కంప్యూటర్లు హెచ్చరిస్తుంటాయి ఆడపిల్లల తలిదండ్రులు ఎక్కువగా వివాహిత అయిన కుమార్తె ఇంట్లోనే ఉండే ఆచారం వుంది నిరుద్యోగులకు ఐదు సంవత్సరాల వరకు పెన్షన్ ఇస్తారు అంత లోగా వాళ్ళు ఉద్యోగాలు వెదుక్కోవాలి వెదుక్కోక పోతే అలాట వ్యర్థ జీవిని లెక్క చెయరు ఒన్ పెరెంట్ ఫ్యామిలీ అనేది ఇప్పుడు ఆచారమైంది చిన్నప్పుడు ప్రేమికుడు మోసం చెయడం వల్లనో, మరొకారణం వల్లనో కాలు జారి పిల్లలను కనిన తల్లుల కుటుంబాలను ఒన్ పెరెంట్ ఫ్యామిలి అంటారు

పెళ్ళి కాక పిల్లలను కనిన తల్లులకు ఇది గొప్ప రక్షణ క్రింది మధ్య తరగతి వారిలో భార్యలను బాధించే వాళ్ళూ ఉన్నారు అందువల్ల మహిళా విమోచనోద్యమమూ ఉంది పై తరగతివారిలో ఈ బాధ లేదు స్త్రీ పురుషులు సమానంగా పని చేస్తాయి కాని పచ్చి మైదానం కోత (లాన్‌మూవింగ్) వంట బారిపనులు స్త్రీలు చెయరు పూల చెట్లు లేని ఇల్లులేదు పూవులంటే వారికి ప్రాణం మనదేశపు బంతి చెట్లకు చాల గిరాకి ఒక మొక్క ఐదు మార్కులకు (దాదాపు 60 రూపాయలు) అమ్ముతుంది శివగన్నేరంటేను(నాగలింగం) అంటేను వారికి చాల ఇష్టం నల్లమందు




# హైదరాబాద్ నోట్‌బుక్

మొక్కలను వారు చాల పెంచుతారు పై మధ్య తరగతి వారికే కళలపై ప్రతి మధ్య తరగతికి క్రింది వారికి లేదు కనుక పిల్లలకు కళా చైతన్యం కలిగిస్తున్నారు విద్యావిధానంలో ఇది ఒక భాగం పల్లెటూళ్ళు చాల శుభ్రంగా ఉంటాయి

పల్లెటూళ్లకు పట్నాలకు భేదం పల్లెలలో ఆవుల మందలు పందుల దొడ్లు కనిపించడం భూమి గరిష్ట పరిమితిలేదు రైతులకు చాల సౌకర్యంవుంది మధ్యవర్తి లేడు రైతే సరాసరి తన పంటను అమ్మవచ్చు స్వయం సమృద్ధి అంతటా కనబడుతుంది గ్రామాలంతటా సిమెంటురోడ్లు పందుల పెంపకం ఎక్కువ కోళ్ళు తక్కువ వారి ఆహారం గ్రామాలలో పెద్ద కొడలి పెత్తనం వుంది జర్మన్లకు తమ సంస్కృతి పైన అపార ప్రేమవుంది యుద్ధంలో నేల మట్టమయిన మ్యూన్‌స్టర్ నగరాన్ని విద్యార్థులు ప్రొఫెసర్లు పునర్నిర్మించుకున్నారట ఈ విషయం ఎంతో గర్వంగా చెప్పుకుంటారు వాళ్ల వల్ల మనం నేర్చుకోవలసినవి క్రమశిక్షణ పొదుపు, పారిశుధ్యం ఆరోగ్య రక్షణ, పాలు పళ్ళు విరివిగా వాడడం, ఎదుట వారిని గౌరవించడం మున్నగునవి ఎన్నో వున్నాయి అక్కడ ఇటీవల శాకాహార ప్రచారం ఎక్కువగా ఉంది- అని అన్నారు డాక్టర్ యశోదా రెడ్డి మనువు - ఇక్కడ పుట్టిన విద్వాంసుని నుంచి ప్రపంచమంతా అన్ని విషయాలు నేర్చుకోవాలి అన్నాడు ఆ స్థితి నుంచి మనం పడిపోయాము మరల నిలదొక్కుకుని ఇతరుల నుంచి మంచివి నేర్చుకుని ఉన్నతిని సాధించాలి

**ఉపశ్రుతి:—**

ఏం సార్ తక్కిన పార్టీల వారంతా లక్షాధికారులవుతున్నారే మీ పాతకాంగ్రెస్ వారు ఎక్కడ వేసిన గొంగళి సామెతగా వున్నదే- అనడగారు నన్నొకరు ఈ చాదస్తుల బతుకింతేసార్- అన్నారు పక్కన ఉన్నవారు

—తిరుమల రామచంద్ర



*Printed and Published for Nageswara Rao Estates Private Ltd,
by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,
Editor S Radhakrishna, Phones - Business 61247, 61248, Editorial 75667*

# గోదావరి
## డి.ఎ.పి.










# అన్ని పంటలకు అనువైన ఎరువు

మన ప్రధానమైన పంటలు వరి, మిరప, ప్రత్తి, వేరుశెనగ, చెఱుకు, జొన్న. ఈ పైరులనుండి అధిక దిగుబడులను పొందడానికి నత్రజని, భాస్వరపు ఎరువుల వినియోగం ఎంతయినా అవసరం.

నత్రజని 18 శాతం, భాస్వరం 46 శాతం కలిగిన గోదావరి డి.ఎ.పి. మొక్క వ్రేళ్ళను వృద్ధి చేస్తుంది. పైర్లను ఏపుగా పెంచుతుంది. మొక్కకు డి.ఎ.పి. వాడకం వల్ల పోషకాహారాలు బాగా లభించి కాయలు, గింజలు అధికంగా పండుతాయి.

అన్ని పంటలకు, అన్ని నేలలకు అనువైన ఎరువు. అత్యుత్తమ ఎరువు గోదావరి డి.ఎ.పి. అందుకే గోదావరి డి.ఎ.పి. ఎరువు కొనండి. దుక్కిలో గాని, దమ్ములో గాని వాడండి.

అధిక దిగుబడులను పొందండి
"అదే మీ కాంక్ష

మీ రాబడిని పెంచండి
అదే మా వాంఛ"






**గోదావరి** ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్
వాణి నిలయం, 10 సెబాస్టియన్ రోడ్, సికింద్రాబాదు - 500 003

**పైరు దిగుబడికి - రైతు రాబడికి**

Priyadarshini







# అమృతాంజన్‌కే తెలుసు తలనొప్పి బాధ



మృదువైన మూలపదార్థము వల్ల ఉపయోగించుట సులభము

క్రొత్త కార్కు అమరిక వల్ల మందు శక్తికి రక్షణ




OBM 8708 TG



1984 ఒలింపిక్స్ క్రీడలలో పాల్గొన్న భారత క్రీడాకారులకు అధికారపూర్వకంగా పెయిన్ బామ్ సరఫరా చేసినవారు.

# అమృతాంజన్

ఏ ఇతర బాధలు కల్గించని

శీఘ్ర నివారిణిని నమ్మండి